# పేద రైతు

[నాటకం]

కొనాల గోపాలరావు

ఆదర్శ గ్రంథమండలి
విజయవాడ

రెండో కూర్పు
ఫిబ్రవరి 1953
వేయి ప్రతులు
కల్యాణి ప్రెస్
విజయవాడ


వెల : రూపాయి



సంపాదకుడు :

గద్దె లింగయ్య

# అంకితము



జీవితాన్ని అభ్యుదయాంధ్ర కళావికాసానికి

అంకితం చేస్తూ

ప్రగతిపథంలో కళాతపస్విగా పయనిస్తున్న మిత్రుడు



“శర్మశ్రీ” కి

ప్రేమ పురస్సరంగా.

—రచయిత.

# ఈ నాటికలోని పాత్రలు



| | | |
|---|---|---|
| నాగయ్య | .... | పేదరైతు |
| శంకరం | .... | నాగయ్య కొడుకు<br>బి. ఎ. విద్యార్థి |
| వెంకయ్య | .... | నాగయ్యజ్ఞాతి |
| శ్రీనివాసరావు | .... | నాగయ్య అల్లుడు |
| రాముడు | .... | వ్యవసాయకూలీ |
| రాజారావు నాయుడు | .... | ధనిక భూస్వామి<br>మిల్లు ఓనరు |
| రామస్వామి అయ్యరు | .... | బ్లాక్‌మార్కెట్<br>బియ్యంవర్తకుడు |
| కనకాయ | .... | నాయుడు బంటు |
| వీరాయ | .... | నాయుడు నౌకరు |
| సర్కిల్ ఇన్‌స్పెక్టరు | | |
| శారద | .... | నాగయ్య కుమార్తె |

# పేదరైతు

---

## ప్రథమాంకం

### 1వ రంగం

[అది నాగయ్యగారి యిల్లు. యింటికి తూర్పు పడమర ద్వారాలు. ఇంటికి తూర్పువైపున వరండా. వరండాలో ఒక కుర్చీ— రెండు మంచాలు. గోడకు ఒక చిలకకొయ్య. అచ్చటచ్చట గాంధి, నెహ్రూ, కొన్ని దేవతల ఫొటోలు వుంటాయి. నాగయ్య మంచంమీద కూర్చుని తకిలీతో నూలు తీస్తూంటాడు. వయస్సు 48 సంవత్సరాలు. తెల్లగా మెరసిన గడ్డం, పలక జుట్టు. కళ్ళకు మనకజోడు—ఖద్దరు కట్టుపంచ, ఒక లాల్చి. నూలు తీస్తూ మెల్లగా భగవద్గీతలోని శ్లోకం పల్లిస్తుంటాడు.]

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మ సంస్థాపనార్థాయ
సంభవామి యుగే యుగే॥

[ఇంతలో శారద సంతోషంతో వుత్తరం పట్టుకొని వస్తుంది. వయస్సు 16 సంవత్సరాలు. ఖద్దరు పరికిణీ, జాకెట్టు, ఓణీ ధరించివుంటుంది. ప్రతివిషయంలోను కొంత తొందరపడే స్వభావం కలది.]

శార : నాన్నా!......నాన్నా!...

నాగ : యేమిటమ్మా యీ హడావుడి!

శార : అన్నయ్య వస్తున్నాడట నాన్నా!

నాగ : (తెగిపోయిన పోగు అతుకుతూ) ఎవరు చెప్పారమ్మా!

శార : ఇదిగో ఉత్తరం వచ్చింది. (ఉత్తరం చూపిస్తుంది)

నాగ : ఏదీ, ఏమన్రాశాడో కాస్త చదువు విందాం.

శార : చదువుతే మరి నాకు ఓణీ కొనిపెడతావా?

నాగ : అలాగే కొనిపెడతాలే చదువు.

శార : పరీక్షలైపోయినాయట! రేపు మెయిలుకు వస్తున్నానని వ్రాశాడు. నాన్నా...

నాగ : ఏమిటమ్మా:

శార : నాకు ఓణీ కొనిపెట్టవూ?

నాగ : కొనిపెడతాలే. (నిట్టూర్పు)

శార : ఎప్పుడూ అట్లాగే అంటావు. మొన్న పండక్కు అంతా కొత్తకొత్త బట్టలు కట్టుకొంటే నాముఖానికి ఈ మొద్దు ఖద్దరుబట్టలేనాయె. ఆ వాయలు ఓణీలు ఎంత బాగున్నాయి! ఎప్పుడూ ఖద్దరు-ఖద్దరు-నా ముఖానికి యింతకంటె మంచివి దొరక్కపోయినయ్యా! (ముఖం చిట్లిస్తుంది.)

నాగ : అదిగో అప్పుడే మారాంచేస్తున్నావు.

శార : (కన్నీళ్ళు పెట్టుకొని) నేను మారాంచేస్తున్నాన్నా!

నాగ : (తకిలీ, కళ్ళజోడు ప్రక్కన పెడుతూ) అదిగో అప్పుడే కోపం వచ్చింది. యిట్లా రామ్మా! (శారద దగ్గరకు వస్తుంది. నాగయ్య తలనిమురుతూంటే, ఓణీ చెంగు మెలిపెడుతూంటుంది విచారంగా.) నిన్ను కాదని

యింకా ఎవరికి కొనిపెడతాను తల్లీ! అన్నయ్యను రానీ బస్తీనుండి నీ యిష్టమొచ్చింది తెప్పించుకుందువుగాని. ఏం, సరేనా?

శార : (తల త్రిప్పుతూ) నాన్నా......!

నాగ : యింకా యేమిటమ్మా!

శార : వాళ్ళ మాలతి బంగారపు గాజులు చేయించుకొంది. అందులో చెక్కుడుగాజులు యెంత బాగున్నాయను కొన్నావ్! తీసుకురానా చూద్దువుగాని.

నాగ : చూచినవన్నీ కావాలనిపిస్తుంది. వాళ్ళకేం డబ్బున్న వాళ్లు. డబ్బున్నవాళ్ళతో సరితూగ్గలమా ?

శార : నాకు చూచినవన్నీ కొనిపెడుతున్నావేం?

నాగ : అదిగో అప్పుడే అలుగు. నేను కొనిపెట్టానన్నానా? మనం డబ్బున్నవాళ్ళతో సరితూగ్గలమా అన్నానుగాని.

శార : అవున్లే. నా కంటే డబ్బుండదు. అన్నయ్యకు యెన్ని వందలుపెట్టి చదివించావు? అన్నయ్యకు కావలసినవన్నీ కొనిపెట్టలా? మా అమ్మ వుంటే...

నాగ : (నిట్టూర్పుతో) మీ అమ్మే బ్రతికుంటే నా కీ చింతే లేకపోను. చూడు తల్లీ! మనం పేదవాళ్ళంకదూ. పెద్ద పెద్ద కోరికలు కోరితే తీరుతయ్యా చెప్పు?

శార : (కోపంతో) దరిద్రం అంతా నా ముఖాన్నే వున్నట్లుంది.

[కన్నీరు పెడుతుంది. ఇంతలో వెంకయ్య ప్రవేశం. పచ్చి మంచం వాల్చి కూర్చుని నార చీల్చుతూంటాడు.]

వెంక : యేమిటమ్మాయి! నాన్నతో పోట్లాడుతున్నావు.

నాగ : అమ్మాయికి బంగారుగాజులు కావాలంట్రా.

వెంక : యివాళ తప్పినా రేపు పెళ్ళినాడు - మాఖమాసంలో తప్పవుగదా? దానికి యిప్పుడే తగూ దేనికి?

శార : నా కేమీ అక్కర లేదు లే (కోపంతో లోనికి వెళ్తుంది.)

నాగ : (చిరునవ్వు నవ్వి) పిచ్చి తల్లి! పట్టు పట్టిందంటే వదలి పెట్టదురా! తల్లి లేని పిల్ల. యేమనటానికీ నోరు రాదు వెంకయ్యా!

వెంక : ఆడపిల్లల ఆశంతా పుట్టింటిమీదే వుంటుంది. చిన్నతనం కదూ? పదిమందీ పచ్చగా కనుపిస్తూంటే అమ్మాయి కూడ వాళ్ళతోపాటు వుండాలని అనుకుంటుంది పాపం!

నాగ : అనుకుంటే యెట్లారా? యిప్పటికే అబ్బాయి చదువుకు రెండువేలు బాకీ అయింది. మొన్న మీ వదినపోతే దేనికై తేనేం రెండువందలు బాకీ అయిందనుకో.

వెంక : మళ్ళీ యెవరికీ పెట్టిందీ పోసిందీ లేదు.

నాగ : వున్న ఆ మూడెకరాల కొంద్రణతోనే వంటిమీది గుడ్డ దగ్గరనుండి యింట్లో చిల్లర సరుకులఖర్చుదాకా గడుపుకోవాలాయె.

వెంక : చిన్న పిల్లలు వాళ్ళ కేం తెలుస్తుంది సంసారంలోని మంచీ చెడ్డాను. అందులో మనలాంటి పేద కాపురాల సంగతి యిక అడగాలా?

నాగ : ఉన్న పొలంకాస్తా తాకట్టుపెట్టి డబ్బు తెచ్చి పిల్లవాడికి పెద్ద చదువు చదివిస్తున్నాను. దేవుడు చల్లని చూపుచూస్తే యేదన్నా ఉద్యోగం దొరికి వాడి బ్రతుకు వాడే బ్రతుకుతాడు.

వెంక : ఏం బ్రతుకో ఏం బండలో, ఒకపూట తింటే రెండో పూట పస్తేగా ?

నాగ : లేని సంసారాల్లో అంతేరా !

వెంక : మా తాతలనాడున్నదీ యీ దరిద్రమే; మా తండ్రినాడున్నదీ యీ దరిద్రమే. మన బ్రతుకంతా వెళ్ళబుచ్చుతున్నదీ యీ దరిద్రంలోనే. ఎన్నితరాలు మారినా యీ దరిద్రంమాత్రం మారటంలేదు.

నాగ : మనం అట్లా అని అనుకోటమేగాని, ఉన్న పొలమా కొద్ది? సంసారాలా గంపెడంత.

వెంక : రాబడే లేకపోయె మరి.

నాగ : యింకా యీ దరిద్రం యెట్లా పోతుందిరా?

వెంక : బజార్లో యేది కొనాలన్నా కొరివిగానేవుండె. కల్లాల రోజుల్లో ధరలు తగ్గటం, అవే మళ్ళీ మనం కొనబోయే సరికి ఆకాశానికి అంటడమూను.

నాగ : నిజమేరా.

వెంక : ఈ సంవత్సరం మట్టుకు యీ సంవత్సరం జనపవిత్తనాలు బస్తా 3 వందల రూపాయలు అమ్మినై కదా ! యింకా యెట్లాచెప్పు! ఒక్క ఆవుపెయ్యను మేపుకుందామంటే జనపపుల్ల లేకపోయె. గొడ్లవంక చూస్తుంటే పుట్టెడు దుఃఖం వస్తుంది.

నాగ : కాదంట్రా మరి, నోరులేని పశువులయ్యె. యిదివరకు మనుషుల నోటికాడి ధాన్యాన్నే దొంగవ్యాపారం చేస్తున్నారనుకొంటే యిప్పుడు నోరులేని పశువులనోళ్ళు కూడ కొడుతున్నారు.

వెంక : చూస్తే యిది దొంగవ్యాపారుల రాజ్యం అయిపోయి నట్లుంది. ఏంచేస్తేమాత్రం వాళ్ళను అడిగే నాథుడేడీ?

నాగ : స్వరాజ్యం వచ్చిందిగా! తొందరలోనే యీ దొంగ వ్యాపారులకు శిక్షలు తప్పవు లేరా.

వెంక : ఏంస్వరాజ్యమో అన్నయ్యా యిది? నల్లా తెల్లా అన్న రంగుభేదాలు తప్పితే మనలాంటివాళ్ళకు యేం ఒరిగింది?

[శారద ప్రవేశం]

శార : ఏం నాన్నా! భోజనానికి రావూ?

వెంక : యింకా భోజనం కాలేదేమిటి? చాలా ప్రొద్దెక్కింది.

నాగ : ఆ—వస్తాలే వుండమ్మాయ్.

వెంక : ఏం అన్నయ్యా! అమ్మాయిపెళ్ళి యీ సంవత్సరం కూడా చెయ్యవా యేమిటి? ఏ యీడుకు ఆ ముద్దూ ముచ్చటా అంటారు. (శారద వెళ్ళిపోతుంది)

నాగ : చెయ్యకపోతే యెలాగురా. మంచి సంబంధంకోసం చూస్తున్నాను. పెళ్ళిగీత వుండాలిగాని, ఆ ఘడియవస్తే యెంతసేపు. అదీ అయిపోతుంది.

వెంక : మొన్న యేదో సంబంధం వచ్చిందటగా? ఆ సంబంధం కూడా తిరిగిపోయినట్లేనా యేమిటి?

నాగ : ఆ...సంబంధాలు మంచివే వస్తున్నాయికాని, కట్నాలే యిచ్చుకోలేకుండా వున్నాంరా!

వెంక : యేం కట్నాలో యేం పత్తికట్లో. ఆడపిల్లల్ని కన్న తల్లిదండ్రులు అడుక్కుతినే రోజు లొచ్చినై. వెనక మనకాలంలో యిట్లాంటి కట్నాలూ కానుకలూ ఎరుగుదుమా? అంతా పచ్చికలి అయిపోయె. ఏంకాలం!

నాగ : అదేమిటోరా! ప్రతివాడూ నాలుగు యింగ్లీషు ముక్కలు నేర్పించడం, చదువుపేరుచెప్పి వేలకువేలు కట్నాలు గుంజడం. చదువు లేకపోతే పరాయివాళ్ళు మనదేశాన్ని దోచుకుంటారనుకుంటే, చదువుకొని మన వాళ్ళు మనల్నే దోచుకుంటున్నారు. యింకా యెట్లా గురా?

వెంక : యెట్లాగేముంది. వాళ్ళు అడిగినంతా మనం యిచ్చుకో వాల్సిందే! లేకపోతే యింట్లో పడవేసి వుంచుకోవల సిందే. పోషించలేనివాళ్ళకా మనపిల్లని చూసూ చూస్తూ యివ్వలేం. మనసొప్పదుగా. ఆస్తి వున్నవాళ్లు పెద్దకట్నాలు యివ్వందే రారు.

నాగ : యెందు కొస్తారు? పట్నంలో చదువుతున్నా డంటే అదొక గొప్ప.

వెంక : చదువుకునేది వాళ్ళకోసమేగాని మనకోసమేమీ కాదు గదా! చదువుకున్నవాళ్ళుకూడ యింత నీచానికి పాల్ప డుతున్నారే!

నాగ : తెల్లవారి లేస్తే ప్రజాసేవఅంటూ అంతా ప్రజల కష్ట సుఖాలను మోస్తున్నట్లుగా చెప్తారు. దయ్యాలు వేదా లను పఠించినట్లుందిరా వీళ్ళ ప్రజాసేవ.

వెంక : కాకపోతే సంతలో గొడ్డులాగున ఆడదానికి అమ్ముడు పోతారా?

నాగ : సంఘంయొక్క దురాచారం క్రొత్తపద్ధతిలో పెరిగి పోతూందిరా.

వెంక : ఈ సంఘ దురాచారంలో మునిగి ఊపిరాడక చచ్చేది మనమే ముందు.

నాగ : అట్లాగే వుంది రా? సంఘంలో డబ్బులేకపోతే వెలి. పిల్లలకు పెళ్ళిళ్ళు చేయకపోతే వెలి. యిటు పిల్లల్నా యింట్లో వుంచుకోలేము. కట్నాలా యిచ్చుకోలేం. యెట్లాగో!

వెంక : ఎంత నరకం! ఆడవాళ్ళకు చావటానికీ, బ్రతకటానికీ కూడ స్థానం లేదు యీ దేశంలో.

[రాముడు ప్రవేశం. గటుపంచ, తలగుడ్డ, చిరిగిన చొక్కా, చేతిలో కర్రా, మాసిన గడ్డం]

నాగ : ఏంరా రాముడూ?

రాము : అబ్బబ్బా! యిక బ్రతక లేమండీ యీ వూళ్ళో.

వెంక : యెవరు కొట్టి కొరతనేశారురా నిన్ను?

రాము : చూడండి! ఆ రాజారావు నాయుడుగోరు యెట్లా బాదారో

శార : (ప్రవేశించి) ఆయన కేమొచ్చింది నిన్ను కొట్టటానికి?

వెంక : వున్న వాడూ!

శార : ఆయనకుంటే యెవరికన్నా వూరికేనే పెడుతున్నాడా?

రాము : కొట్టకుండా తిట్టకుండా వుంటే పెట్టినంత ఫలితం. మా మాదిగది చెరువుకు నీళ్ళకుపోతే కుండ పగలగొట్టి యెల్లగొట్టారు. నేను కామందుగారితో చెప్పకుండా మని వెళితే నన్నూ చావబాదాడండి.

నాగ : హూం......!

వెంక : చెర్లో నీళ్ళు తెచ్చుకుంటే వాడిదేం పోయిందిరా?

రాము : నీళ్ళు మైలపడుతున్నాయిటండీ.

నాగ : గొంతు పట్టుకుంటయ్యా త్రాగడానికి. యింతకాలం నుంచీ లేని అంటు యిప్పుడు వచ్చిందా యీయనగారికి?

వెంక : కొబ్బరిచెట్టు యెక్కావు దేనికిరా అంటే దూడ గడ్డి కోసం అన్నాడుట వెనకటి కొకడు. అట్లావుంది ఈయనగారి పని.

రాము : పూర్వంనుండి పనులొచ్చినై అంటే, ఒకటి రెండు రోజు లూరికేనే చేస్తున్నామండీ ఖామందుగారికి.

వెంక : గుడినేకాక గుళ్ళో లింగాన్నికూడా మింగాలనుకునే వాడికి యెన్ని మేళ్ళుచేస్తేనేముందిరా?

శాం : చెరువు ఆయనదేనా?

నాగ : చెరువు తవ్వించింది ఆయనగాదు. చెరువుపట్టు నేల మాత్రం తనదంటాడు.

వెంక : ఒకప్పుడు పంచాయతీబోర్డు ప్రెసిడెంటుగా వెలిగించాడు. అప్పుడు పంచాయతీడబ్బు కాజేసి ఆ స్థలం కొని తనపేర పెట్టుకొన్నాడు.

నాగ : అప్పుడు చెరువు తవ్వాలి అనగానే వూరూ, గూడెం తలొక చెయ్యివేసి ఆ చెరువు తవ్వారు. పేరుకు మాత్రం తనదంటాడు.

వెంక: అప్పుడు పంచాయతీడబ్బు కాజేస్తే అడిగే నాథుడే లేక పోయె.

రాము: అంతేనండి ఆయూాల మీాకోసమేగదోయ్, నేనేమన్నా కట్టుకుపోతానా అన్నాడు. తీరా యియ్యాల ఆ చెరువు

స్వంతం అంటూ చెరువుచుట్టూ బరిశలిచ్చి మనుషుల్ని కాపలిపెట్టాడు. పిల్లలు మంచినీళ్ళకు చస్తున్నారు.

వెంక: చస్తేనేం, ఆ దొరగారికి దిగులా చింతా?

శార : సర్కారుకు తెలియచెయ్యకపోయారూ?

నాగ : సర్కారుదాకా దేనికి గ్రామంలో నలుగురు పెద్దల్ని పోగుచేసి పంచాయతీ పెట్టిస్తే తెలుస్తుంది దీని రంగం.

వెంక: చెరువుపట్టు నేల ఏడిదైతే మాత్రం చెరువు తవ్వింది దేనికి? గ్రామప్రజలకోసం గాదూ? ఆమాటకొస్తే పంచాయతీ డబ్బుకు లెక్క చూపించొద్దూ?

నాగ : అసలు ఆయనకో తగూ దేనికొచ్చిందిరా?

రాము: మొన్న పండగ చేసుకుంటూ నాయుడుగారు పనికి పిలిస్తే యెవ్వరూ యెల్ల లేదండి. అదీ ఆయనగారికోపం.

నాగ : బాగానే వుంది.

వెంక: పండగచేసుకునేది నాయుడుగారేగాని బీదవాళ్ళు చేసుకోగూడదన్నమాట!

నాగ : పని వూరికే చెయ్యాలగదా?

వెంక: లెక్కలమ్ముకుంటే ఆ అద్దెడుగంజ లిస్తారు. లేకపోతే అదీ లేదు.

రాము: ఆ చెరువులో నీళ్ళు తాగనిస్తున్నాడని పతిసమత్సరము ఒకటి రెన్నాళ్ళు వూరకనే చేస్తున్నామండీ కామందు గారికి. మొన్న ఆ మామూలుదగ్గరే కొంత గొడవ జరిగిందంట.

నాగ : కాకపోయినా సంవత్సరాల తరబడి ఆయనకు వెట్టి చేసారేం?

వెంక: చేసినన్నాళ్ళు చేశారు. యిక వాళ్ళకు యిష్టమైతే చేస్తారు, లేకపోతే లేదు.

శార : దానికి బలవంతం దేనికి?

వెంక: ఫలానావారి చెరువు అని చెప్పేది అందుకేగా! దినం మంచిదైతే రోజూ దొంగిలమన్నాడంట. ఏపూట కాపూట పొయ్యిమీదకు తెచ్చుకునేవాళ్ళు పూరకనే యెట్టాచేస్తారు; ఆయనగారిని తిన్నాదుగింజ లియ్యమను, యిస్తాడేమో?

రాము: యిప్పుడైనా మేము చెయ్యమనడం లేదుగా?

శార : అంత డబ్బు పెట్టుకొని మీచేత ఏమని చేయించుకొంటున్నాడు సిగ్గులేక.

వెంక: ఇవ్వాళ నలుగురు పెద్దల్ని పోగుచేసి ఆ చెరువుసంగతి పూర్తిగా తేల్చివేయరాదూ?

నాగ : తేల్చడం అంత తేలికైనపనిగాదు.వూళ్లో అతని అడుగులగు మడుగులొత్తేవాళ్ళు చాలామంది వున్నారు. మంచిగానే మనపని గడుపుకోవాలి.

రాము: పిల్లలు మంచినీళ్ళకు చస్తున్నారండీ.

శార : నువ్వన్నా వెళ్లి వాళ్ళకు దగ్గరుండి కాసిని మంచినీళ్లు ముంచుకోనిమ్మని చెప్పిరా నాన్నా! పాపం పిల్లలు మంచినీళ్ళకు యెలా తపించిపోతున్నారో!

నాగ : లాభంలేదమ్మా! పైగా పోయి పరువుతీయించుకోవడమే. కాకపోయినా స్వార్థానికి గుడ్డితనం వారసత్వంగావచ్చింది.

వెంక: తల్లిపాలు త్రాగి రొమ్ములు గుద్దేవాళ్ళకు మంచీ మర్యాద లుంటయ్యా?

శార : అయినా ఒకసారి వెళ్ళిరా నాన్నా!

నాగ : సరే, వెళ్ళివస్తాను. నా పేముకర్రా, పైగుడ్డా యిట్లా తీసుకురామ్మా (ఏకులు, తకిలీ అందిస్తాడు. శారద లోని కెళ్తుంది. యింతలో బయటనుండి పాట వినిపిస్తుంది.)

రాము: తినటానికి యింత తిండీ లేకపోయినా త్రాగడానికి నీళ్ళుకూడా కరువువచ్చింది. ఏం దేశమో ఏం బ్రతుకో!

నాగ : (శారద కర్ర, పైగుడ్డ తెచ్చి యిస్తుంది) అమ్మాయీ! వాడికి కాసిని భిక్షం పెట్టమ్మా. రారా రాముడూ, రారా వెంకయ్యా! (వెళ్ళుతూండగా తెర పడుతూంటుంది. పాట వినిపిస్తూనేవుంటుంది.)

బాబూ లోక మంటారా?
మానవ లోక మంటారా?
కష్టపడేటి శ్రామికజాతి
కడుపులు కాల్చి మేడలు వేసే
ధనవంతులదే దేశమంటారా? బాబూ!
తినగ తిండీ కట్ట గుడ్డా
నిలువ నీడా లేని పేదలు
నోరువిప్పి హక్కులడిగె
అపకారులే తేనేలేవా? బాబూ!
హెచ్చుతగ్గుల వాద వివాదంలో
శాంతి కలదంటారా? బాబూ!
రాజ్యమంటారా స్వారాజ్యమంటారా?
ఏదని బాబూ! ప్రజారాజ్య మంటారా?

[పాట అయిపోగానే తెరపడుతుంది]

# పేద రైతు

## 2వ రంగం

[ అది రాజారావునాయుడు మేడ. మేడముందు వరండాలో ఒక టేబిల్, చుట్టూ మూడు కుర్చీలు, పైన ముఖమల్ గుడ్డ, ఒకఫ్లవర్ వాసు, దినపత్రిక వుంటాయి. నాయుడు కుర్చీలో కూర్చొని పత్రిక చూస్తూండ గా తెరలేస్తుంది. వీరాయ ట్రేలో విస్కీ బాటిల్సు పెట్టుకొని తీసుకొస్తాడు. బల్లమీదపెట్టి గ్లాసులో పోస్తూ వుండగా మధ్య మధ్య నాయుడు త్రాగుతూ పత్రిక చూస్తూంటాడు. వయస్సు 20 సం॥లు. సిల్కు షర్టు, సిల్కు ధవతి, రిష్టువాచి, షైక్సు ఉంటాయి. గోడలకు కొన్ని వ్యంగ్య చిత్రపటాలు గాంధి, నెహ్రూ మొదలైన దేశనాయకుల ఫోటోలు వుంటాయి. జార్జిరాజు ఫోటోకూడా వుంటుంది. త్రాగటం సంపూర్తిచేసి సిగరెట్ ముట్టిస్తాడు ]

రాజా: ఎవరన్నా వచ్చారా?

వీరా : లేదండి.

రాజా: (పొగవదలుతూ) ఊ...వెళ్ళి పిలిచి వచ్చావా మరి?

వీరా : పిలిసొచ్చానండి.

రాజా: యింకా రాలేదేం?

వీరా : యింటిదగ్గర లేడండి.

రాజా: ఫ్యాక్టరీ దగ్గరనుండి గుమస్తా వచ్చాడా?

వీరా : యింకా రాలేదండి.

రాజా: మరి కనకాయో ?

వీరా. యెవ్వరూ రాలేదండి.

రాజా: యెక్కడ చచ్చారు వీళ్ళు? వెళ్ళి పిలిచిరా.

వీరా : చిత్తం.

రాజా: ముందు ఆ రాముణ్ణి, నాగయ్యనూ, కనకాయనూ కేకేసిరా. (పత్రిక చూస్తూవుండగా వీరాయ బయటకు వెళ్ళి మళ్ళీ తిరిగివస్తాడు.

రాజా: (తలెత్తి) మళ్ళీ వచ్చావు దేనికి ;

వీరా : మీకోసం యెవరో వచ్చారండి. బయట వున్నాడు. రమ్మంటారా ?

రాజా: సరే, వెళ్లి రమ్మనిచెప్పి తీసుకురా.

వీరా : చిత్తం. (వెళ్లిపోతాడు. కొద్దిసేపటికి రామస్వామి అయ్యరు ప్రవేశం. వీరాయకూడా వెంట వచ్చి దూరంగా వుంటాడు.)

రామ: నమస్కారగళే!

రాజా; నమస్కారం.

రామ: నాయుడుగారుదా మీరేనా?

రాజా: ఔను, నేనే. దేనికి?

రామ: ఒన్నుమిల్లె. మీతో చిన్న పనిదా వుంది.

రాజా: నాతోనా! అలా కుర్చీలో కూర్చోండి.

రామ: (కూర్చొంటూ) నాదిదా మద్రాసు. యిక్కడ వ్యాపారంమీాదదా వచ్చాను.

రాజా: ఏం వ్యాపారం అది?

రామ: యిక్కడ యూరుదా లేరుకదా? (వీరాయవంకచూస్తూ) ఎన్నయ్యా అట్లుదా చూస్తుంటివి? కాస్తదా ఉళ్ళపో, అయ్యగారితోదా మాట్లాడవలయును.

రాజా: నువ్వు వెళ్ళి వారిని పిలిచిరారా.

వీరా : చిత్తం. (వెళ్తాడు)

రామ: నాకు బియ్యందా కావలయును. నేను బియ్యం వ్యాపారం చేస్తుంటిని. యిది యూరికిదా తెలియకూడదు.

రాజా: అలాగే లెండి. యేమాత్రం బియ్యం కొంటారు?

రామ: నాకు ఒక వంద బస్తా బియ్యందా కావలయును.

రాజా: సన్నాలా? కుసాలా? ఢిల్లీభోగాలా?

రామ: మీదగ్గర యేవిదా వున్నయ్?

రాజా: అన్నిరకాలూ వున్నయ్. మీకు కావలసినవి పట్టుకెళ్ళండి.

రామ: సరిదా! యిక్కడ బళ్ళుదా దొరుకుతయ్యా?

రాజా: దొరుకుతై కాని...

రామ : ఎన్న సందేగం! యిక్కడ పట్టుకొందురాయేమి?

రాజా మనజాగ్రతలో మనం వుండటం దేనికైనా మంచిది.

రామ: ఆమ...అట్లుదా సొల్లు. నా కంటంమీదకుదా రాదు కదా?

రాజా : రాదులెండి; కాని...మనకు వ్యతిరేకపార్టీ ఒకటి వుంది.

రామ : ఎన్నపార్టీలు. ఎన్న దేశం! రొంబదా కష్టమొచ్చెనే. మా తమిళనాడులోదా యిట్లాంటివాళ్లే చచ్చారు. మీ తెలుగుదేశంలోకూడా వ్యాపారం సాక్కపోతే

తిరుక్షవరమైతే కాఫీహోటల్లో సప్లయిదా చెయ్యవలసి వుందును.

రాజా: (నవ్వి) మీరు దేనికైనా సమర్థులు. మీ కా భయం అక్కరలేదు. నా మనుషుల్నిచ్చి పంపిస్తాలెండి.

రామ: సరిదా, అట్లుచెయ్యండి. ఒకవిషయం. యీవేళ నేను బస్తీకిదా పోలేను. ఇక్కడ భోజనహోటలు ఉండెనా?

రాజా: వుంది లెండి.

రామ: సరిదా, మీరు మిల్లుదగ్గరకిదా వస్తురా?

రాజా: దేనికి?

రామ: బియ్యం మచ్చుదా చూడవలయును.

రాజా: బియ్యం ఫ్యాక్టరీలో లేవు. ప్రొద్దుకూకినాక మా గుమాస్తాను కలుసుకొంటే బియ్యం మచ్చు చూపిస్తాడు.

రామ: ధరదా యెట్లు సరిచేస్తిరి?

రాజా: నలుగురితోపాటే లెండి.

రామ: సరిదా, నేను హోటలుకు పోయివస్తును.

రామ: మంచిది. వెళ్లిరండి. (పీరాయ, నాగయ్య ప్రవేశం) వీరికి భోజనహోటలు చూపెట్టరా.

పీరా: చిత్తం (యిద్దరూ వెళ్తారు)

రాజా: (విషపునవ్వు నవ్వుతూ వినయంగా) ఏం చేస్తున్నారండీ. అసలు కంటికే కనుపించడంలేదు.

నాగ: ఆఁ... యేముందండి చేయటానికి. యేదో కృష్ణా, రామా అంటూ యింట్లోనే వుంటున్నాను.

రాజా: నా నోటుబాకీ చెల్లిస్తారా యీ సంవత్సరమైనా?

నాగ : యేదండీ, చేతిలో చిల్లిగవ్వలేదు. అందులో పిల్ల, పిల్లాడు పెళ్ళీడుకొచ్చి వున్నారు. వాళ్ళకు యీ సంవత్సరమన్నా ఆ మూడు ముళ్ళూ వేయించాలని చూస్తున్నాను.

రాజా: అయితే శుభస్య శీఘ్రం అన్నారు పెద్దలు. యెక్కడన్నా మంచి సంబంధాలు వస్తున్నాయా? యీ సంవత్సరం కూడా నా బాకీ డబ్బు యివ్వరన్న మాట. బాకీ చాలా పెరిగిపోతోంది. యెట్లా తీరుస్తారో యేమిటో మరి.

నాగ : అన్నిటికీ ఆ భగవంతుడే వున్నాడు.

రాజా: అబ్బాయి కాలేజిచదువు యీ సంవత్సరంతో పూర్తి అయినట్లేనా? యింకా చదివిస్తారా?

నాగ : యీ బి. ఏ. చదివించేప్పటికి రెండు మూడు వేలు బాకీ అయింది. వాళ్లను ఒక యింటివాళ్లనుచేస్తే అదే పదివేలు. నా కళ్ల ముందు వాళ్లు ఒక యింటివాళ్లు అవుతారో లేదో అనేదే నాభయం. ఈ తలమునిగే అప్పులతో వున్నాను. ఖర్చుచేసే రోజులన్నీ ముందే వున్నయి. ఏం కానుందో మరి!

రాజా: ఆ... మొన్న ఆ గూడెపువాళ్లు చేసిన అఘాయిత్యం విన్నారా? పైగా మీలాంటి పెద్దలు తప్పంతా మాదే నన్నట్టుగా అనుకుంటారు.

నాగ : ఏం చేశారు?

రాజా: యింకా యేంచేయాలి. ఆ వూరచెరువు కాస్తా తమ దేనని మా కాపలావాళ్లను కొట్టారు.

నాగ : వాళ్లు కొట్టారా?

రాజా: ఏం. మీకు నమ్మకం లేదా? అసలు మనమేనండి వాళ్లకు కాళ్లిచ్చి యింతవరకు తెచ్చింది. వెంకడిని వెంకయ్యా అన్నా అంకిళ్లు నొక్కుకుపోతె పలకటానికి. మాబోటిపెద్దలు వీధిని వెళుతూంటే మంచంమీద కూర్చుని లేవరయ్యో. మన వీధిగుండానే సైకిళ్లెక్కి, గొడుగులు వేసుకొని నడుస్తుంటారయ్యో. తక్కువకులపు వాళ్ల జ్ఞానమే వాళ్లకు లేదయ్యో. మనవాళ్లే కొందరు వాళ్ళను వెనకేసుకు రాబట్టే వాళ్ళకు ఆ తలబిరుసు. నేను వద్దని చెపితే ఆ మాలవెధవల్ని తీసుకెళ్ళి చెర్లో నీళ్ళు ముంచించారటగా?

నాగ : కన్నతల్లే విషంబెడితే యింకా ఆ దరిద్రులకు దిక్కెవ్వరు చెప్పండి.

రాజా: చాల్లేవయ్యా, నీ ధర్మోపదేశాలు.

నాగ : న్యాయాన్యాయాలు తెలిసిన మీరే......

రాజా: ఊరుకోవయ్యా! బుద్ధిలేని ఆ గాడిదలకు తెలియకపోతే నీ కెలా తెలియలేదయ్యా? రేపు దేవుళ్ళ వుత్సవాలు వస్తున్నాయి. యీ మడ్డి ముండాకొడుకులు ఆ నీళ్లను మైలపరిస్తే ఉత్సవాలు జరుగుతయ్యా!

నాగ : యింతకాలంనుండీ లేని అంటుదోషం యివ్వాళే వచ్చిందా? అసలు స్వరాజ్యం వచ్చినాకకూడా యీ జాతిభేద మేమిటండీ? గాంధీశిష్యులమైన మనం...

రాజా: మనం లేదు, మట్టీలేదు, ఊరుకోవయ్యా. నా చెర్లో. నీళ్లు త్రాగుతూ నా కావలివాళ్లను కొట్టటమా! యింతకూ వాళ్ళు తిరగబడటానికి మీలాంటివాళ్లే

కారణం. నా చెర్లో నీళ్ళు ముంచివ్వ వద్దంటే ముంచి వ్వటానికి మీరెవరంట?

నాగ : అంత పెద్దపెద్ద మాటలు దేనికిలెండి నాయుడుగారూ! ఆవుల్ని చంపి చెప్పులు దానంచేస్తే నూచి సంతో షించే వెవరండీ? ఊరివాళ్లు మంచినీళ్లకు చస్తుంటే ఉత్సవాలు చేయిస్తారా?

రాజా: నీ ఆదర్శాలు నాకు అక్కరలా. నీకిష్టమైతే వాళ్లను నీ యింట్లో కలుపుకో; అంతేకాని, నా ఆస్తిపైన దౌర్జ న్యం చేయటానికి మీరెవరంట?

నాగ: దౌర్జన్యం యెవరుచేస్తున్నా రంటారు? గూడెపువాళ్లు మంచినీళ్లు అడగటమే దౌర్జన్యమా? గ్రామప్రజల ఉమ్మడి చెరువుచుట్టూ బరిశలిచ్చి మనుషుల్ని కావలి పెట్టి, పైగా దౌర్జన్యం మేము చేయిస్తున్నామంటారా?

రాజా: అంతవరకూ వచ్చారూ? సరే, యీరోజు మొదలు కొని యెవరైనా నా చెర్లో కాలుపెడితే గోరీకట్టిస్తాను జాగ్రత్త! ఆ చెరువుపట్టునేల నాది. మీరెవరంట అడగ టానికి?

నాగ : ఆ చెరువు మీ దెలా అవుతుంది? చెరువు త్రవ్వింది గ్రామప్రజలు. చెరువుపట్టునేల కొన్నది పంచాయితీ డబ్బుతో. మరి ఆవేళ పంచాయతీ డబ్బంతా యేం చేశారు? యిప్పటికైనా గౌరవాన్ని కాపాడుకోండి. గోళ్లతో పోయేదానికి గొడ్డళ్లు దేనికి? యీ విషయం ప్రభుత్వానికి తెలిస్తే. . .

రాజా: ఏం తెలిస్తే! తలకొట్టి మొలేస్తారా? అదీచూస్తాలే.

నాగ : ఇది బ్రిటిష్ ప్రభుత్వం కాదు. ప్రజా ప్రభుత్వమనే సంగతి మరచిపోకండి.

రాజా: ఏ ప్రభుత్వమైనా మాకు దాసోహమనాల్సిందే. గుడ్డి గవ్వ ఖరీదు చెయ్యని ప్రతివాడూ బెదిరించడమేనా?

నాగ: సరే, కానివ్వండి. (వెళ్ళబోతాడు)

రాజా: యిదిగో, మళ్ళీ హెచ్చరిస్తున్నాను. యెవ్వడన్నా చెర్లో కాలుపెట్టాడా...(మీసం మెలివేస్తూ చూస్తాడు)

నాగ : (మాట్లాడకుండా వెళ్ళబోతూంటాడు)

రాజా: ఉప్పుగంటికి కొరగాని ప్రతివాడూ దేశభక్తుడే!

నాగ : (వెనక్కు తిరిగి) మీరు మర్యాద తప్పి మాట్లాడు తున్నారు.

రాజా: పోవయ్యా అవతలకు. పెద్ద మర్యాదస్తుడివి బయల్దే రావ్.

నాగ: మా మర్యాదలు మీకేం తెలుస్తాయిలెండి. (వెళ్ళి పోతాడు)

రాజా: ఒకపూట తింటే రెండవపూటకు గతిలేని గాడిదలకు మర్యాద కావాల్సి వచ్చిందట! మర్యాద!!

[సిగరెట్ ముట్టించి పచార్లుచేస్తోండగా కనకాయ ప్రవేశం. విశల్ క్రాపూ, కోరమీసాలు, ఒక బనీను, మెడలో తాయెత్తూ, పొట్టిగా బొద్దుగా వుంటాడు.]

రాజా: చెరువుదగ్గరకి వెళ్ళివచ్చావా?

కన : చిత్తం. అక్కడినుంచే వస్తున్నా.

రాజా: చెర్లో గూడెపువాళ్లని కాలుపెట్టవద్దని చెప్పావా?

కన : చెప్పాను.

రాజా: మిల్లుదగ్గరకి వెళ్లివచ్చావా?
కన : వెళ్లి వచ్చానండి.
రాజా: యివ్వాళ లారీ లేమన్నా వచ్చినయ్యా!
కన : యింకా రాలేదు దొరా.
రాజా: గుమస్తా మిల్లుదగ్గ రున్నాడా ?
కన : వున్నాడండి.
రాజా: నువ్వు వెళ్ళి గుమాస్తాను రమ్మని చెప్పు.
కన : చిత్తం (వెళ్లబోతుండగా రాముడు ప్రవేశం)
రాజా: ఏం, దొరగారికి తీరిందా రావటానికి ?
రాము: ఈరయ్యగా రొచ్చినపుడు నేను యింటిదగ్గర లేనండి. నేను యింటికి రాగానే మీ జీతగత్తె చెప్పింది. ఆపాటున పరుగెత్తుకుంటూ వచ్చాను.
రాజా: ఏం, కాపలావాళ్లమీద తిరగబడుతున్నావటగా?
రాము: నేనా? రామ రామ! నాకేం తెల్వదండి.
రాజా: తెలియదూ? నేను వద్దని చెప్పినాక మళ్లీ ఆ నాగయ్యను తీసుకొచ్చి చెర్లో నీళ్లు ముంచుకెళ్లావటగా?
రాము: పిల్లలు గొంతెండి చత్తుంటే అయ్యగారిని తీసుకొచ్చి కాసిని నీళ్లు తీసుకెళ్లానండి.
రాజా: తీసుకెళ్లావూ ముండమోపి!
కన : వాడి కళ్లకు యిప్పుడు మీరు కనుపిస్తున్నారా!
రాజా: చెర్లో నీళ్ళు ముంచివ్వటానికి వాడెవడురా! తిత్తి తీయిస్తాను ఒక్కొక్కడిని.
రాము: వూరి కున్నది ఆ ఒక్క చెరువేనయ్యా. యింకా యెక్కడ తెచ్చుకోమంటారు దొరా?

రాజా: యెక్కడ తెచ్చుకుందామని పనికి పిలిస్తే పండగ మొద లెట్టారు? ఆ చెరువు మీా అమ్మామొగుడి దను కున్నారా?

కన : పండించేవాడిదే భూమంట! కౌలుదార్ల చట్టం కావా లంట! కూలీ సంఘాలు పెట్టబోతున్నారండోయ్.

రాజా: ఏమిటీ!

రాము: ఏదో కులపువాళ్లం నలుగురం కలిసి వుందామను కున్నాం. అంతేనండీ.

కన : అంతేనా? ధనవంతులు నశించాలని మీా రనలంలా ?

రాజా: ఒళ్ళు బలిస్తే సరి! యెన్నైనా వాగుతారు, రేవటినుండి చెర్లోగాని, చేలోగాని కాలుపెడితే నరికి పోగు లెయ్యండి. మరి ఆ డబ్బు యింకా ఇవ్వలేదేంరా?

రాము: ఏ డబ్బండీ?

రాజా: ఏం డబ్బా! కూతురు పెళ్ళి వెలగబెట్టటానికని తీసు కెళ్లింది.

రాము: అప్పుడే యిస్తినిగా దొరా!

రాజా. ఎప్పుడిచ్చావురా దున్నపోతా?

రాము: ఆ వుత్తరపు పొలంలో మినుములిచ్చి చెల్లగట్టాను. అప్పుడు నా నోటుకాగితం యిమ్మంటే పోయిందన్నారుగా.

రాజా: అబద్ధం ఆడితే పళ్ళురాలతై.

రాము: అబద్ధమాడితే నాకీ భూమిా్మద నూకల్లేకుండా పోతయ్.

కన : యింతకూ నువ్వనేదేమిటిరా?

రాము: డబ్బు యిచ్చాగదండి.

రాజా: ఊఁ...(కనకాయికి సైగ చేస్తాడు)

కన : ఏమన్నావురా; నీ బతుక్కూ—తోడు దొరగార్నే ధిక్క—రిస్తున్నావ్రా? (రాముణ్ణి మెడబట్టి నెట్టివేయగానే ముందుకు పడతాడు.)

రాజా: నువ్వు యిచ్చే దేమిటిరా ముండా! నీ ప్రాణాలే నా చేతిలోవున్నై, నెట్టెయ్యి వీణ్ణి బయటకు.

కన : పదరా...పద. (బలవంతంగా బయటకు నెట్టుకు వెడతాడు.)

రాజా: బ్రూట్స్! వీళ్లని నోరెత్తితే గోరీ కట్టాలి. కుంటూ సెంటూ లేని ప్రతి కుంకా నాకు యెదురు తిరగడమేనా? చూస్తాను! (సిగరెట్టు నేలకేసికొట్టి కోపంగా వెళ్లిపోతాడు.)

[తెర పడుతుంది.]

★

# పేదరైతు

---

## 3 వ రంగం

[శారద యింట్లో కూర్చుని కూనిరాగాలు తీస్తూండగా నాగయ్య నవ్వుతూ ప్రవేశం.]

నాగ : (కూర్చుని) ఏమిటమ్మాయ్ పాడుతున్నావు?

శార : ఏమీంలేదు నాన్నా! అన్నయ్య రాసినపాట పాడుతున్నాను.

నాగ : అబ్బాయి పాటలుగూడా రాస్తున్నాడా యేమిటి? ఏదమ్మా మళ్ళీ పాడు విందాం.

శార : నాకు రాదు.

నాగ : సిగ్గుపడతావేం పిచ్చితల్లీ!

శార : పాడితే మరి నాకు జడబిళ్ళ చేయించిపెడతావా?

నాగ : ఆడపిల్లలతో పెద్దచిక్కే వచ్చింది. ముద్ద ముద్దకూ నంజుళ్ళా! అలాగే చేయిస్తాలే పాడు మరి.

శార : అప్పుడు ఓణీ కొనిపెట్టావా, యిప్పుడు జడబిళ్ళ చేయిస్తావు. అన్నీ అబద్ధాలే! (ముఖం చిట్లిస్తుంది)

నాగ : నిన్ను కాదని యింకా యెవరికి కొనిపెడతానమ్మా! ఏదీ ఒకసారి పాడు. ఊఁ...సిగ్గెందుకమ్మా, పాడు.

శార : (పాడుతుంది)

నవ్యయుగ ప్రారంభమూ
    నవ్యయుగ పోరాటమోయ్
నవ్యశక్తులు ఉద్భవించిన
    భవ్యసంపద విస్తరించును
పారతంత్ర్యపు ఉక్కుపట్టము
    పగులగొట్టగ పరుగులిడవోయ్
పాలపొంగులు జాలువారే
    జీవగడ్డను పాడుబెట్టి
తిండిగుడ్డకు చావనేలా?
    వీరులారా! లెండు లెండోయ్!

[పాట పూర్తిఅయ్యేసరికి శంకరం ప్రవేశం. వయస్సు 24 సం॥లు. గ్లాస్కో పంచకట్టు, పాప్లయిన్ షర్టు, చేతికి రిస్టువాచీ వుంది. నవ్వుతూ లోనికి రాగానే శారద యింట్లోకి పోతుంది.]

నాగ : ఎక్కడికి వెళ్ళావురా? యింత ప్రొద్దెక్కినా తిండీ తిన కుండా యేమిటీ తిరగడం?

శంక : పంచాయతీ పెద్దలదగ్గర కెళ్ళాను మాట్లాడుదామని. అయినా యిప్పు డేమంత ప్రొద్దెక్కింది?

నాగ : యింకా నయం. అసలు తెల్లవారనే లేదంటావ్. ఇక నన్నా వెళ్లి ఆ నాలుగుమెతుకులూ తిని రా. ఇవ్వాళ రాముడు నీకోసం మూడుసార్లు వచ్చి వెళ్ళాడు.

శంక : ఎందుకో చెప్పలా?

నాగ : చెప్పకేం.

శంక : ఏమని?

నాగ : ఏముందిరా! వాళ్లకు ముందునూస్తే నుయ్యి, వెనుక నూస్తే గొయ్యిలాగుంది. ఆ నాయుడు వాళ్లను సీకాకు తింటున్నాడురా.

శంక : పిన్నోళ్ళ నోరుమూసుకొని కూర్చుంటే ఆయన యెన్నైనా చేస్తాడు.

నాగ : కలిగిన మహారాజులలో మనలాంటివాళ్ళకి కయ్యమెందుకురా?

శంక : యిప్పుడు కయ్య మెవడు కావాలని కత్తులు పట్టుకొని కూర్చున్నాడు? మన న్యాయమైన హక్కులు అడగటం కూడా పాపమేనా యేమిటి నాన్నా?

నాగ : యివ్వాల్టినుండి మన రత్తయ్య, వెంకయ్య, రాఘవయ్యలను, రాముణ్ణి కౌలుచేలలోకి రావద్దన్నాడట. అత నా పొలం కొనేటప్పుడు అవి వట్టి చవిటిపర్రలు. యింతకాలంనుంచీ వాళ్లాపొలం దున్ని బాగుచేస్తే తీరా యివ్వాళ వాళ్లను చేలో కాలు పెట్టవద్దన్నాడటరా!

శంక : ఎందు కనడూ! ఆయనకు అడ్డమైన వెట్టిచాకిరీ చేస్తే పొలం కౌలు కివ్వడం, లేకపోతే పొలంలోనుండి నెట్టివేయడం. వూళ్లో మూడువంతులభూమి వాడిదే కదూ! రైతన్నవాడికి యెవడికీ చారెడు భూమి లేదయ్యో.

నాగ : లేనిదాన్ని యెవడు రమ్మంటాడు, వున్నదాన్ని కాజేయకుంటే చాలు.

శంక : కౌలుదార్ల చట్టం వస్తుందనగానే అరుగాలంనుండి పండించే రైతుల్ని చేలలోనుండి నెట్టివేసి సొంత వ్యవసాయం

అంటూ నాటకం ప్రారంభించాడు. వీడి దుర్మార్గాలను యెదుర్కొంటానికి సంఘశక్తికన్నా వేరే మార్గం లేదు నాన్నా !

నాగ : ఒకడు యేటికి లాగితే రెండోవాడు కాటికి లాగు తాడు. గొంతుమీంది కొచ్చినా కలిసిరారురా.

[వెంకయ్య ప్రవేశం]

వెంక : యెందుకు కలుస్తారు? ఆనాడు గూడెపువాళ్ళను చెరువులో నీళ్ళు త్రాగవద్దంటే నోరు మూసుకు కూర్చు న్నాం; కాబట్టి యివ్వాళ మమ్మల్ని చేలల్లోకి రానివ్వ న్నాడు. యెట్లారా వీడితో బ్రతికేది?

వెంక : మనం బ్రతకపోతే వాడికేం? చూడు బాబాయ్! యింతమంది రైతులు వూళ్ళోవుండి యిట్లాంటి అగ చాట్లు పడకపోతే వీళ్ళంతా యెందుకు సంఘాలు పెట్టుకోకూడదు?

నాగ : సంఘాలు పెట్టుకోటానికేంగాని, యీ వూళ్ళో నాయుడు 30, 40 వేలదాకా రైతులకు అప్పులుపెట్టి వాళ్ళందరినీ తన చేతికింద వుంచుకొన్నాడురా!

వెంక . వాడికి వెయ్యెకరాల భూమి, ఒక రైసుమిల్లు వున్నై. అంతా యేపూట కాపూట పొయ్యిమీదకు తెచ్చు కునేవాళ్లేకదరా!

నాగ : అందరిచేత అడ్డమైన వెట్టిచాకిరీ చేయించుకొంటాడు. యెంతచేసినా ఆ మహారాజుకు ఆగ్రహామేకాని అను గ్రహం లేదు.

శంక : యెందుకుంటుంది? రక్తం త్రాగేవాడికి మాంసం తినడం ఒకలెక్కలోదా? అసలు మన రైతుల్లో కట్టు బాటుంటేగా?

వెంక : యెందుకుంటుందిగా? ఒకడు చేస్తున్న పొలానికి రెండో వాడు అడ్డమెళ్లి పురులు కడతాననీ, కుప్పలు నూరుస్తాననీ, సొంతపొలం దున్ని పెడతాననీ, ఆఖరుకు పాచి పని దగ్గరనుండి పక్కలేసేవరకు చేసి, మేము చేసే పొలానికి యెక్కువ కవుళ్లిచ్చి కాజేసిరి.

శంక : పైకిమాత్రం మేమూ రైతులమేనని మీసాలు మెలి వేసుకుంటూ తిరిగే చౌదరమ్మలంతా నానాటికీ చేయ టానికి భూమిలేక సంసారాలు పెరిగిపోయి యెట్లా నాశ నమైపోతున్నారో కానలేకుండా వున్నారు. ఇంట్లో ఈగల మోత, బయట పల్లకీమోతగా వుంటై వీళ్ళ దర్జాలు.

నాగ : అందాకా దేనికి? మనపని చూడరాదూ. నీ చదువు కోసం రెండువేలు తెస్తే మూడువేలదాకా దేకిం చాడు.

వెంక : యెందుకు దేకించడూ? యెంతమంది పకీర్లు గాకపోతే ఆయన దర్జాలు సాగుతున్నాయి.

శంక : యెందుకు సాగవు. మనలాంటివాళ్ళు నలుగురూ కళ్ళు తెరిచేదాకా ఆయనదర్జాలకే లోటూ వుండదు.

నాగ : బాకీకోసం మనమీద కోర్టులో దావా వేశాడటరా! మళ్ళీ మన కిదొక ఖర్చు వచ్చిపడింది. అమ్మాయి పెళ్ళికి మూడు నాలుగువందలతో పోతుందనుకుంటే ఆరేడు వందలదాకా అయింది.

వెంక : యింకానయం. ఆయన దేముడల్లే వచ్చాడు. మంచి సంబంధం దొరికింది. లేకపోతే యిల్లూ, పొలమూ చాలేదా?

నాగ : దేవుడి దయవల్ల అమ్మాయికి ఆ మూడుముళ్ళు పడినై. కట్నంకోసం గాకుండా పెళ్ళయితేనే చాలురా అని చేసుకెళ్లారు. అట్లాంటి సంబంధాలు అందరికీ రావు.

శంక : రాకపోతే మునిగిపోయే దేమీ లేదులే. అల్లుడు బుద్ధిమంతుడనా బాబాయ్ మీ వుద్దేశం? పెళ్లికి ముందు నాకు బావగారి చర్యలు తెలిస్తే యీ పెళ్లికి ఒప్పుకొనేవాడినే కాదు. యింతకంటే మంచిసంబంధాలు రావనా!

వెంక : ఏమిటిరా నీకు తెలిసింది?

నాగ : నీ బావ చేసిన తప్పేమిటిరా? నిక్షేపంలాంటివాడు.

శంక : అవును. యెవరికంపు వాళ్ళకు యింపుగానే వుంటుంది. త్రాగుబోతు. జూదరి. అందుకనే పాతికేళ్ళు వచ్చినా యెవ్వరూ పిల్ల నివ్వలేదు. మనమే తెలియక ఆ గోతిలోపడి పిల్లగొంతు కోశాం.

నాగ : ఏమిటీ? (ఆశ్చర్యపోవును)

వెంక : మంచి ప్రయోజకుడేనన్న మాట?

శంక : కాకపోతే యేమిటనుకొన్నారు?

నాగ : అల్లుడు అట్లాంటివాడని ముందుగా మనమేమన్నా కలగన్నా మేమిట్రా?

వెంక : అంతేలేవే అన్నయ్యా.

నాగ : దానికి బ్రహ్మరాత యెట్లా వుందో అట్లాగే జరిగి

పోయింది. విధికృతం యెవరు తప్పిస్తారురా?

శంక : విధి. విధట, విధి!

వెంక : ఏదో జరిగిందాన్ని గురించి యిప్పుడు అనుకుంటే యేం లాభంరా? ఆఁ... రేపు సంక్రాంతిపండుగ వస్తోంది. అల్లుడుకోసం నెళ్లి రాకపోయినాగా!

నాగ : అది అబ్బాయినే అడుగు.

వెంక : ఏరా శంకరం?

శంక : తీసుకురాక తప్పుతుందా మరి. (శారద వస్తూ యీ మాట వింటుంది.)

శార : అసలు ఆయనగారు యిక్కడికి వస్తారా? ఆయన తిరుగుడేమో, విలాసాలేమో!

వెంక : అప్పాయి! శ్రీనివాసరావు తాగుతాడా?

నాగ : చీట్లపేకగూడ ఆడతాడటగా?

శార : అన్నీ వున్నయ్.

వెంక : తాగినవాళ్ళు, జూదం ఆడినవాళ్లు యెవరు బాగుపడ్డారు?

నాగ : తాగేది బాగుపడటానికా?

శంక : యెవరు బాగుపడ్డారని బావగారు బాగుపడుతాడు?

శార : నవ్వినా నాపచేనే పండుతుంది. అంతా యిట్టా తిరిగినవాళ్ళేగా!

వెంక : యెవరూ?

శార : ఎవరేమిటి బాబాయ్! భారత భాగవతాల్లో మనం వినటంలా. ధర్మరాజూ, నలుడూ మొదలైన వాళ్ళంతా మొట్టమొదట భార్యల్ని సైతం కోల్పోయిన వాళ్లేగా!

శంక : ఏడ్చినట్టే వున్నై యీ ఆదర్శాలు. ఈ కట్టుకథలా నీ కాపురానికి ఆదర్శాలు. యిక బాగుపడినట్లే!

శార : యెవరి అదృష్టం యెవరి కొస్తుంది?

వెంక : ఊరుకోరా, అమ్మాయికి కోపమొచ్చింది.

నాగ : కోపం రావటానికి వాడు కానిమాటేమన్నాడులే.

శార : (కోపంతో) అంటేమాత్రం నన్నేగా! నన్ను అనడమంటే నీకు సంతోషమేలే. (వెళ్ళిపోతుంది)

నాగ : పిచ్చిపిల్ల! అర్థంలేని కోపాలురా. (నవ్వు)

[రాముడు విచారంగా ప్రవేశం]

శంక : రాముడూ విశేషాలేమిటి?

రాము: తాగటానికి నీళ్ళు లేకపోతే తలదాచుకోటానికి జానెడు కొంపైనా వుందనుకొంటే యియ్యాల ఆ నాయుడు గోరు తనస్థలంలో వుందని పీకేయించాడండి.

నాగ : ఆఁ!

వెంక : ఆఁ లేదు, ఊఁ లేదు. యియ్యాల నాయుడు ఆడింది ఆట, పాడింది పాటగా వుంది. డబ్బున్నవాడు గదూ.

శంక : వాడికి డబ్బుండక యేంజేస్తుంది, మనలాంటి పేదవాళ్ల రక్తం పిండుతుంటేను.

రాము: నీళ్లు తాగనీయక, కొంపలో తలదాచుకోనీయక ఇట్టా హింసిస్తున్నాడండి.

వెంక : చెట్టు చెడేనాటికి కుక్కమూతి పిందెలు పుడతాయంట. వీళ్ళు ఎంత అదిరిపడితే అంతా వాళ్ల వినాశనానికే లేరా.

నాగ : ఏనుగుల్ని తినేవాడికి పీనుగుల పిండాకూడన్నట్లు ఆ

తెల్లవాళ్ళున్నప్పుడు ఎట్లా మండించారో ఇప్పుడూ అట్లాగే వెలగబెడుతున్నారు.

శంక : యింకా ఎన్నాళ్ళు మండిస్తాడులే. "వినాశకాలే విపరీత బుద్ధిః" అన్నట్టు వీడు చేసిన దుర్మార్గాలకు ప్రాయశ్చిత్తం జరిగే రోజు రాకుంటుందా? ఆఁ, ఏం రాముడు! మంచినీళ్ళు పక్కవూరినుండే తెచ్చుకుంటున్నారా? పంచాయతీపెద్దలు గవర్నమెంటుకు రిపోర్టు పంపుతామన్నారు. ఆ చెరువుసంగతి రెండురోజుల్లో తేలిపోతుందిలే.

రాము: పోనీయండి సామీ! ఆ పాడుగుంటలో నీళ్ళు తాగలేక చత్తున్నాము. ఆ! యియ్యాల ఆ నాయుడుగారి ముఠా పల్లెలో బళ్ళకోసం తిరుగుతున్నారు.

వెంక : దేనికో?

శంక : ఇంకా దేనికి? దొంగబియ్యం జారవెయ్యటానికి.

రాము: అందుకేనండి.

శంక : సరే, నీవు వెళ్ళి యెన్నిబళ్ళు యెత్తుతున్నారో, ఎక్కడికి వెడుతున్నారో కనుక్కురా.

నాగ : ప్రక్కన పోయేదాన్ని పైన వేసుకోనడం దేనికిరా? ఉన్నవాడితో తగాదా ఎందుకు?

వెంక : అఘోరించాడు. ఒకప్రక్కన ఊళ్ళోవాళ్ళు తిండిలేక చస్తుంటే దొంగవ్యాపారం చేస్తున్నాడూ! యిలాంటి వాళ్ళని యేంచేసినా పాపంలేదు.

నాగ : ఉరిశిక్ష వేయాలన్నాడుగా నెహ్రూగారు.

వెంక : ఏదీ! యీ నాయుడులాంటివాళ్ళకు ఒక్కడికైనా ఉరిశిక్ష వేయించాడూ ఆ నెహ్రూగారు?

శంక : అసలు ఆ అలుసు చూచుకొనే ఈ దొంగవ్యాపారులు ఇట్లా ప్రజల్ని దోచుకుతింటున్నారు.

రాము: దొరకు మెత్తనైతే గుర్రం మూడుకాళ్ళమీద నడిచిందట. అసలు ఈళ్ళే దొంగలకు దోవ నూపిస్తుంటే వాళ్ళు ననటం దేనికంట?

శంక : నిజమే రామునూ! సంఘానికే వేరుపురుగులైన యీ దొంగవ్యాపారులే బెంగాలులో 30 లక్షలమంది ప్రజల్ని తమ పొట్టన పెట్టుకొన్నారు. ఇప్పటినుంచి సంఘాలు స్థాపించి యెక్కడున్న దొంగవ్యాపారులకూ, లంచగొండి ఉద్యోగులకు బుద్ధి చెప్పాలి. సంఘశక్తి కన్నా వేరేమార్గం లేదు.

నాగ : ఈ దొంగ వ్యాపార నిర్మూలనకు సంఘాలు దేనికిరా? సత్యాగ్రహం చేయకూడదూ? శాంతివిప్లవంతోనే కదూ మహాత్ముడు స్వరాజ్యాన్ని సాధించింది.

రాము: ఏం సత్యాగ్రహాలో ఏం సౌరాజ్యమోనండి! కూటికీ గుడ్డకూ మాత్రం మొహంవాచి చస్తున్నాము.

వెంక : మనలాంటివాళ్ళను పీక్కుతినటానికే నాయుడులాంటి కోటీశ్వరులు, ధనవంతులకు వచ్చిన స్వరాజ్యంరా యిది.

శంక : నిజమే బాబాయి. కాకుల్నికొట్టి గద్దలకు వేసినట్లుగా లేనివాళ్ల కడుపులుకొట్టి, వున్నవాళ్ల పెట్టెలూ, పొట్టలూ నింపుతున్నదీ స్వరాజ్యం. దీనివల్ల మనలాంటివాళ్లకు యేమీ ఉపయోగంలేదు. మనకుఆర్థిక స్వాతంత్ర్యం కావాలి. కష్టించే వాడికే భూమిపైన,

ఆ స్థిపైన హక్కు వుండాలి. ఆ ఆర్థిక స్వాతంత్ర్యాన్ని సాధించాలంటే మనమంతా సంఘాలు స్థాపించి, మన హక్కులకోసం పోరాడాలి.

వెంక : అంతేరా; న్యాయం చచ్చినాక మనం బ్రతికి దేనికి? సంఘాల్లో చేరాల్సిందే.

రాము: అంతేనండి. యీ ముండబ్రతుకు యెన్నాళ్లు బతుకుతాము?

నాగ : దేనికైనా ఆత్మవిశ్వాసముండాలి.

శంక : చచ్చినా బ్రతికినా ప్రజలకు సంఘశక్తికన్నా వేరే మార్గంలేదు. సంఘశక్తిద్వారానే తెల్ల ప్రభుత్వాన్ని యెదుర్కొని మన దేశాన్నుండి వెళ్ళగొట్టగలిగాం. ఆ సంఘశక్తిద్వారానే యీ దుర్మార్గాల్నికూడా యెదుర్కోవాలి.

వెంక : అంతేరా.

రాము: తాగటానికి నీళ్లులేకుండా తలొకదారిని చచ్చేకంటే యిట్టానే చద్దాం. కానీయండి.

నాగ : శాంతి నెలకొల్పటమే మన లక్ష్యంగా వుండాలి. దాని కోసం శాంతిమార్గాన వుద్యమం సాగించాలి.

శంక : నువ్వు కలలుగనే శాశ్వతమైనశాంతి యీ దొంగ వ్యాపారులు, యీ ధనిక–బీద కష్టించేవాడు – కష్టం చేయనివాడు అనే యీ హెచ్చుతగ్గుల సమాజం వున్నంతకాలం సాధ్యపడదు. యీ కూలిపోయే దోపిడి మూకల శిథిల సమాజవ్యవస్థపైన కుల–మత–వర్గరహిత సమాజం నిర్మించాలి. అప్పుడే మనకు మనదేశానికి

శాంతి. ఆ శాంతిని సాధించాలంటే మన ప్రాణాల్ని సైతం లెక్క చేయకూడదు.

శంక : మనం చచ్చినా మన పిల్లలైనా సుఖపడతా రప్పుడు.

రాము: యీ బతుకంటే ఆ చావే నయం. కానీయండి. సంఘాల్లో చేరాల్సిందే.

నాగ : మహాత్ముని ఆశయాలు మరువకండి.

శంక : భవిష్యత్తులో దేశప్రజల "జీవితాశ" సంఘశక్తిపైనే ఆధారపడి వుంటుంది. దరిద్రాన్ని, నిరుద్యోగాన్ని, నిరక్షరాస్యతను నిర్మూలించి, శాంతి సౌభాగ్యాలతో విలసిల్లే నూతన సమాజనిర్మాణానికి గ్రామగ్రామాన సంఘటిత కార్యక్రమాన్ని సాగించటమే మన కర్తవ్యం. పదండి, పోదాం పదండి.

రాము: అంతే బాబూ, అలాగే చేద్దాం.

శంక : యిది రత్నగర్భలాంటి దేశం. నదులూ, పొలాలూ, గనులూ కొల్లలుగా వున్నా దరిద్రంలో ప్రజలు మాడిపోతున్నారు. యీ దరిద్రాన్ని నిర్మూలించటమే మన జీవితలక్ష్యం.

అంతా : పదండి, పోదాం పదండి.

కోరస్ సాంగ్

కదలండోయ్ కదలండోయ్
కరువురాకాసికి యెరయైపోయే
అనాధలారా లే లెండోయ్
చింపిరి జుట్టూ చింపిరి బట్టల
అనాగరిక ఓ అనాధలారా!

# పేదరైతు

---

## 4 వ రంగం

[అది రాజారావు మేడ. వీరయ్య వరండాలో వెనుకటిలా. కుర్చీలుసర్ది బల్లదగ్గిర తుడుస్తూంటాడు. కనకాయమ్మ ప్రవేశం.]

ఏం వీరయ్యా! నిన్న పనిలోకి రాలేదేం?

ఆ రేళ్ళు బంగారంలా చూసుకుంటూ పెంచుకున్న ఆడ పిల్ల చచ్చిపోయింది కనకయ్యా!

నిన్న అయ్యగారు నీమీద చాల కోప్పడ్డారు.

"గొడ్డుబోతు కేం తెలుస్తుందిరా బిడ్డల బాధా" అని ఒకపూట తినో తినకనో ఆ రేళ్ళు పెంచుకున్న బిడ్డ పోయి నే నేడుస్తుంటే అయ్యగోరు కోప్పడ్డారా?

యింట్లో పనులుచేసేవాళ్ళు లేక యెంత బాధపడ్డా రనుకున్నావ్!

అయ్యగారికి మనిషి లేకపోతేనే అంత బాధగావుంటే కన్న బిడ్డ చచ్చిపోతే మాకేమీ బాధ వుండదా కన కయ్యా! పదేళ్ళుగా అయ్యగారిదగ్గర పనిచేస్తుంటే ఆ పదిరూపాయలుతప్ప దమ్మిడీ పెంచరు. పిల్లముండ

చచ్చిపోయిన్నాడుకూడా శాస్త్ర యింటిదగ్గ రుండటానికి నోచుకోలేదా కనకయ్యా!

కన : అయ్యగారితో మంచిగుంటే ఒకటో రెండో పెంచ మన్నా వెనకాడడు.

వీరా : అది మనకు కాదులే కనకయ్యా! మనం అడ్డమైన చాకిరీ చేయటానికేగాని "నల్చి నావంబెట్టడు." రోగా లొచ్చినా నొప్పులొచ్చినా యీ కొలువు తప్పదు.

కన : దొరగారితో చెప్పనా?

వీరా : వద్దు. బాబో వద్దు. నువ్వన్నావని యిదైనా చెప్పాను. నా సొద పైకి చెప్పుకుంటే పగ కొని తెచ్చుకున్నట్టే. చెప్పకయ్యో కనకయ్యా!

[రాజారావు ప్రవేశం.]

రాజా: దేశమట దేశం! దమ్మిడీకి కొరగాని ప్రతి వెధవా దేశ నాయకుడే! (వచ్చి కుర్చీలో కూర్చుంటూ) నిన్న యెక్కడ చచ్చావురా? చెప్పవేం?

వీరా : (భయంతో) పిల్లముండ చచ్చిపోయిందండీ.

రాజా: చస్తే. నీవూ దానితోపాటు చావకపోయినావ్! పీడ విర గడయ్యేది. మరి వచ్చి పనిలోనికి రానని చెప్పలేదేం?

వీరా : కాలు చేయి ఆడలేదండీ.

కన : పోనివ్వండి యీసారికి.

రాజా : మళ్ళీ యిట్లాంటిపని యింకోసారి చేస్తే డొక్క చీలుస్తా జాగ్రత్త! యింకా అట్లా చూస్తావేం వెధవ మొఖం వేసుకొని; ఆ గేటుదగ్గరకు అఘోరించు.

[వీరాయి విచారంతో వెళ్ళిపోతాడు.]

రాజా: ఊఁ......బళ్ళు ఎంత చీకటివుండగా వెళ్లినయి బస్తీకి?
కన : ఎప్పుడు పోతే నేమిలెండి.
రాజా: (ఆశ్చర్యంతో) ఏం జరిగిందోయ్?
కన : గవర్నమెంటువారు బళ్లను పట్టుకున్నారండి.
రాజా: ఆ !...
కన : పదిమంది తుపాకులతోను, లాఠీలతోను వచ్చిపడ్డారు బళ్లమీద.
రాజా: కాపలావాళ్ళు ఏంచేస్తున్నారు! అఘోరిస్తున్నారా? చేతుల్లో బరిశెల్లేన్వా?
కన : వున్నాయి. ఏం లాభం? ప్రాణాలు దక్కించుకొని పారిపోయి రావాల్సివచ్చింది. అందులో మన వూరువాళ్ళు కూడా వున్నారు.
రాజా: మనవూరివాళ్లా? ఎవరువాళ్ళు?
కన : ఆ నాగయ్య కొడుకు, రాముడు ముఠావాళ్లూను.
రాజా: అంతవరకు వచ్చారూ! మరి మీరు అయిదుగురు బరిశెలతో బళ్ల వెంట కాపలా వెళ్లి పారిపోయి వచ్చారా? రోషం లేదూ?
కన : వాళ్లూ తగిన జాగ్రత్తలోనే వున్నారండి.

[అయ్యరు ప్రవేశం]

అయ్యర్: మీ కాపలావాళ్లుదా నట్టేటపుట్టిముంచుదుకుసామీ! (కనకాయిని చూస్తూ) ఎన్నయ్యా! మీ చేతుల్లో బరిశెలుదా వుంచుకొని నాకు నిండా కష్టం తెస్తిరే
రాజా: ఎన్నివందలు నష్టం? డబ్బుపోతేపోయింది. కోర్టుకెక్కి పరువు తీయించుకోవాల్సివచ్చిందే! యిన్నాళ్లనుండి

వ్యాపారం చేస్తున్నా రెండో కంటివాడికి తెలియదు. నా న్నెన్ను! వట్టి అడవారకం అయిపోయారు! ఇంతకూ ఆ గుమాస్తా నెధవ ఎక్కడ చచ్చాడు?

కస : ఆయనగారిని పోలీసులు పట్టుకున్నారు.

అయ్యా: నేనుమాత్రందా వాళ్లకు చిక్కకుండా పారిపోయి వస్తిని. ఎంగె పోను? ఎన్న దారి?

రాజా: గోదారి. మీతో జాయింటువ్యాపారం మొదలెట్ట గానే ఇదొక పెద్దగండం వచ్చిపడింది. ఎదుటివాడు తింటుంటే ఓర్వలేని నెధవలంతా ఘూవిషంగా దౌర్జ న్యాలు సాగిస్తున్నారండీ.

[కనకాయి వెళతాడు]

అయ్యా: ఒన్ను దౌర్జన్యమేనా? మీ తెలుగుదేశం కంటె మా అరవదేశందా చాలా నయమండీ. అంగె వ్యాపారందా పోసగక ఇంగె వస్తే ఇంగెకూడా వాళ్ళేదా సచ్చిరి. ఎన్న సాగసం! ఎన్నా దౌర్జన్యం! ఎంగపోయినా యీ పోలీసుల బాధదా తప్పగపాయె.

రాజా: పోలీసుల దేమున్నదండీ! వట్టి పిచ్చివాళ్లు. యీ పకీరు నెధవలతోనే వచ్చిందండి దేశానికీ అశాంతి.

అయ్యా: ఆమ. వీళ్ళనుదా సిరితవధ చెయ్యాలి. సిరితవధ!

వీరా : (ప్రవేశం) మీకోసం రైతులు వచ్చారండి.

రాజా: సరే, వెళ్ళి రమ్మని చెప్పు.

వీరా : చిత్తం (వీరాయి వెళ్తాడు. కొద్దిసేపటికి వెంకయ్యా, శం కరం ప్రవేశం. అయ్యారు ముందే లోనికి వెళ్తాడు)

రాజా: ఏం వెంకయ్యా! ఏదో పనిమీద వచ్చినట్లున్నారు?

వెంక: మీతో మాట్లాడుదామని వచ్చామండీ.

రాజా: దేన్ని గురించి?

శంక : ఆ చెరువునుగురించేనండి.

రాజా: ఇంకా నాతో మాట్లాడేదేముంది? పంచాయతీబోర్డు మీచేతుల్లోనే వుంది. మీ చేతనైనపని మీరు చేస్తూనే వుంటిరిగా.

శంక : ఏంచేశామంటారు?

రాజా: చాలా బుద్ధిమంతులు! ఏమీ ఎరుగరు. నోట్లో వెన్న పెట్టినా తినరు; వేలుపెట్టినా కొరకరు.

శంక : యీ పరిహాసాలకుగాదు మే మిక్కడికి వచ్చింది. పిల్లి చెలగాటం ఎలుకకు ప్రాణసంకటంలాగుంది.

రాజా: యీ వుపమానాల కేంగాని, వున్న దేదో చెప్పు.

వెంక: యీ గ్రామానికున్న దా ఒక్క చెరువేనయ్యె.

శంక : మంచినీళ్ళు లేక వూరు, గూడెం అల్లాడిపోతున్నారు.

రాజా: ప్రజానాయకత్వం తీసుకున్నాక ప్రజలను చావనివ్వ టమా! పాతాళగంగైనా తెచ్చి ప్రాణాల్ని కాపాడాలి.

శంక : మా కా వాగ్దానాలు చేతకావులెండి.

రాజా: పదిమందినీ వెంటేసుకొని వున్నవాళ్ల మీద దౌర్జన్యం చేయడం చేతనైనను కాబోలునేం!

వెంక : మేం మీతో వాదాలకు, వైరాలకు రాలేదు. మాకూ మీకూ వాగ్వాదా లనవసరం.

రాజా: మరి?

శంక : పూర్వంలాగానే ఆ చెరువునీటిని గ్రామప్రజలను తాగ నివ్వండి.

రాజా: అదుగో! అదే వద్దంటున్నా. నా ఆస్తిపైన మీ హక్కేమిటంట?

వెంక: అది మీ సొంత చెరువనంటారా ఏమిటి?

శంక : పంచాయతీడబ్బు పెట్టి ఆ చెరువుపట్టునేల కొన్నారు. ప్రజలచేత చెరువు తవ్వించారు. అది మీ దెలా అవుతుంది? ఊరివాళ్ళతో కోరి విరోధం తెచ్చుకోడం మంచిదిగాదు.

రాజా: పనికిరాదు! ఎన్నిప్రాణాలు పోయినా సరే, ఆ చెర్లో నీళ్లు ఒక్కచుక్క ముట్టడానికి వీల్లేదు.

వెంక: అట్లాగైతే మీరు ఎన్నివందలమందిని కాపలా పెట్టినా ఇక ఆ చెరువునీరు ఆపలేరు.

రాజా: ఆ !......

శంక : గవర్నమెంటుమాత్రం కాదంటుందా?

రాజా: బెదిరిస్తున్నారా?

వెంక: ఇందులో బెదిరింపు ఏముంది! ఆ చెరువుతప్ప ప్రజలకు బ్రతకటానికి వేరే మార్గమే లేదయ్యె.

రాజా : అదీ చూస్తాలే. మీరు వెళ్లొచ్చు.

శంక : మీ రీవిధంగా చెరువునీళ్లు ఆకట్టటం బాగా లేదు.

వెంక: ప్రజల్ని హింసించి చంపడమేనా?

రాజా : ప్రజలట, ప్రజలు! ఎవరయ్యా ఆ ప్రజలు? మీ పేరు ప్రతిష్ఠలకోసం నలుగురు కూలివెధవల్ని వెంటేసుకొని బయల్దేరారు. చెప్పుకాళ్ల మీద తలవాల్చి బ్రతికవలసిన వాళ్ళు వళ్ళు తెలియని శివమెక్కి కళ్ళువిప్పి గంతులేయటమేనా! నువ్వు బి. యే. వెలిగించటానికి డబ్బు ఎవ

రిచ్చారు?_ఆ డబ్బు యింతవరకూ తీర్చారూ? జన్మెత్తితే
రోషం వుండనక్కర్లా?

శంక : మర్యాదగా మాట్లాడండి. మీరు మాకుదానమిచ్చారా?
రెండువేలను మూడువేలకు దేకించి కోర్టుకెక్కారే!

వెంక : పోనివ్వరా, వానితో చెప్పి లాభంలేదు.

రాజా: యింకొకసారి హెచ్చరిస్తున్నాను. ఎవరైనా చెర్లో
కాలుపెట్టారా జాగ్రత్త!

శంక : మీరనుకున్నంత తేలికగాదు. మీ కెంత అధికారం
ముందో ప్రజలకూ అంతే అధికారముంది చెరువుపైన.

వెంక : ప్రజల్ని నాశనం చెయ్యాలనుకున్నవాడు ఎవడు బాగు
పడ్డాడు? పదరా, పద._(వెళ్లారు)

రాజా: అధికారమట! (పళ్ళుకొరికి) బ్రూట్స్! వాళ్ళ మొహం
సికిరోడు అధికారం! (అయ్యరు ప్రవేశం)

అయ్య: ఎన్నా సామీ! యీళ్ళుదా రాక్షసులుదా వుండునే.

రాజా: వింటున్నారుగా వాళ్ల దౌర్జన్యం! వీళ్లేనండి మన
బియ్యపు బళ్లను పట్టించింది.

అయ్య: వీళ్లకుదా తగిన ప్రాయచిత్తందా చేయలేరుగదా!

రాజా: సమయంకోసం చూస్తున్నాను. నేను కన్ను తెరిస్తే
గొంగళి పురుగుల్లా మాడిపోవాల్సిందే.(వీరాయివస్తాడు)

వీరా : మీకోసం పోలీసులు వచ్చారండి.

అయ్య : పోలీసు! పోలీసులా! ఎన్నా అప్పా! ఇక్కడకుదా
దాపురించారు వాళ్ళు? యిప్పుడు మనగతిదా ఏంటి?

రాజా: మీరు లోనికి వెళ్లండి. నేను మాట్లాడుతాను.
(అయ్యరు పోవును) పోయి తీసుకురా. (వీరాయి వెళ్ల

గానే సర్కిల్ ఇన్స్పెక్టరు (ప్రవేశం) హాల్లో, గుడ్ మార్నింగ్! దయచేయండి.

సర్కిలు: గుడ్ మార్నింగ్!

రాజా: (కుర్చీ చూపుతాడు. సర్కిలు కూచుంటాడు. సిగరెట్ టిన్నులోనుంచి సిగరెట్టు తీసి యిస్తూ) ఏదో పని మీద వచ్చినట్టున్నారు?

సర్కి: మహాత్మా రైస్ మిల్ మీదేనా?

రాజా: ఔనండీ!

సర్కి: రాత్రి మీ మిల్లు తాలూకు దొంగబియ్యం పట్టుకొన్నాం, మిల్లు సోదా చెయ్యాలి.

రాజా: ఏమిటీ! మా మిల్లుతాలూకు దొంగబియ్యమా?

సర్కి: ఔను, మీ మిల్లుతాలూకు దొంగబియ్యమే. మీ గుమాస్తాకూడా మాకు పట్టుబడ్డాడు.

రాజా: ఆ!...నాకు తెలియదండీ.

సర్కి: మీ వ్యాపారంసంగతి మీకు తెలియదా?

రాజా: తెలియదండీ. నేను కోర్టు వ్యవహారాలమీద మద్రాసు వెళ్లి యీ వుదయమే వచ్చాను.

సర్కి: మరి ఆ బ్లాకు రవాణా మీకు తెలియకుండానే మీ గుమాస్తా చేస్తున్నాడా?

రాజా: చేశాడు కాబోలు సార్! ప్రతి విషయంలోను కాస్త తెలిసినవాడని అతనిమీదనే బాధ్యత వుంచాను. స్వతంత్రించి చేశాడు కాబోలు! ప్రస్తుతం మా మిల్లు వర్కు చేయడం లేదండీ. గవర్నమెంటు తాత్కాలికంగా ఆపివేశారుగా.

సర్కి : మరి పదిబళ్ళు బ్లాకుకైసు ఎలావచ్చింది? ఆబళ్ళు మీవి కాదంటారా?

రాజా: ఎలా కాదనగలను చెప్పండి. నేను గ్రామంలో లేనని మనవిచేశాను గదండి. ఈ గుమాస్తా వెధవలకు స్వతంత్రం యిస్తే ఇట్లాంటి వెధవకేసులు తెచ్చి నెత్తినపెడుతుంటారు. మీరు...... యీ విషయంలో నాకు కాస్త సహాయం...

సర్కి : అది నావల్ల కాదండోయ్.

రాజా: మీరాలాగున అంటే ఇక మా వ్యాపారాలన్నీ మూలపడేసి కూర్చోవాల్సిందే. (జేబులోనుండి 3 వందరూపాయలనోట్లు తీసి యివ్వబోతాడు)

సర్కి : ఏమిటిది?

రాజా: ఏముంది లెండి. మనమంతా పరస్పరం చూచుకోవాలి గదండీ, తీసుకోండి.

సర్కి : మీరు లంచాలిచ్చి మా ప్రాణాలుతీస్తారు. కనికరిస్తే మా వుద్యోగాలే వూడతాయి. కాదంటే మొహమాటం పోతుంది. ఎట్లా చావమంటారు చెప్పండి.

రాజా: ఏదో మీరు చూచీ చూడనట్లు వూరుకోవాలిగాని, యిట్లా పట్టుపట్టితే యెలా చెప్పండి. (మరో 2 నోట్లు తీసి) తీసుకోండి. సందేహించకండి.

సర్కి : (దిక్కులుచూస్తూ) ఇది లంచంగానైతే నేను తీసుకోను. స్నేహంలో ఇస్తామంటున్నారు కాబట్టి కాదంటానికి నాకు నోరు రావటంలేదు. (నోట్లు తీసుకొని జేబులో పెట్టుకుంటాడు) మీరు చాలా అజాగ్రత్తగా ప్రవర్తిస్తు

న్నారు. కాలాన్ని బట్టి ఎట్లా నడుచుకోవాలో తెలుసుకోవాలి.

రాజా: నేనూ తమతో అదే మనవిచేయబోతున్నాను. ఆ గుమాస్తా వెధవ ఒట్టి రోగ్ సార్! కాస్తయినా చురుకుతనం లేదు. మీరు యీవిషయంలో నాకు సహాయపడాలి.

సర్కి: బళ్లు తాలూకాకు తోలించుకెళ్లామే! మీకు నేను ఏం సహాయం చేయగలను చెప్పండి.

రాజా: మీరు ఊఁ అనాలిగాని, మీకేలాంటివి ఒక లెఖ్ఖా చెప్పండి.

సర్కి: దీన్ని యెలా మాఫుచేయాలో నాకు అర్థం కావటం లేదండీ.

రాజా: అదేమిటండీ! యీ కేసుని మాఫుచేయాలనే అనుకుంటే మార్గమే లేకుండా వుంటుందా?

సర్కి: ఆ మార్గమే ఏమిటా అని?

రాజా: ఇంకా యిరవైరోజుల్లో స్వాతంత్ర్యదినం వస్తుందిగా! ఆ స్వాతంత్రోత్సవంనాడు బీదలకు అన్నప్రదానం చేయటానికి గ్రామాల్లో పోగుచేశామనీ, ఇవి దొంగ బియ్యం కావనీ గ్రామంలోని కొందరు పెద్దలచేత సంతకాలు పెట్టించి ఒక మహజరు, లోగడ తారీఖుతో అచ్చు వేసిన కొన్ని కరపత్రాలు తాలూకాకు పంపుతాము. మీరు దీన్లో కాస్త సహాయపడితే యిట్టే తేలిపోతుంది.

సర్కి: సరే, కానివ్వండి. నాచేతనైన సహాయం నేను చేస్తాను. తరువాత మీ అదృష్టం.

రాజా: థాంక్స్. మీకు మామీద ఆపాటి దయవుంటే మీ కాళ్లమీద కనకవర్షం కురిపించనూ. రామ రామ!

యీ గుమాస్తాగాళ్లకు భగవంతు డసలు మెదడే పెట్ట లేదండీ. అసలు నేను వద్దే అన్నాను.

సర్కి : మరి మీ మిల్లు తనిఖీ చెయ్యాలిగా.

రాజా: మిల్లులో ఏమున్నయి గోడగడ్డలు!

సర్కి : అయితే నేను మీ మిల్లు తనిఖీ చేసినట్లు యీ నోటు బుక్కుమీద సంతకం చెయ్యండి. (జేబులోంచి నోటు బుక్కు తీసి యిస్తాడు. రాజారావు సంతకంచేసి యివ్వగా జేబులో పెట్టుకుంటూ) వెళ్లి వస్తానండి. మీరు మీ ప్రయత్నాల్ని యివ్వాళ సాయంత్రానికే పూర్తిచెయ్యాలి. లేకపోతే నాకు అసాధ్య మవుతుంది. ఇప్పటికే చాలా ఆలస్యం జరిగింది. జైహింద్!

రాజా: జైహింద్!

[సర్కిలు వెళ్తాడు. అయ్యరు వస్తాడు.]

అయ్య: (నవ్వుతూ) ఎన్నా నాటకం! ఎన్న తెలివితేటలు!! యివి మా అరవాళ్ల దగ్గరదా లేవండీ.

రాజా: మరి యీ రాజారావునాయు డంటే ఏమనుకున్నారు? చూడండి. మీ బియ్యం మీకు అప్పగిస్తాను.

అయ్య: ఆమ, నేనుదా అట్లేఅనుకొంటిని. మీరుదా అందుకు సమర్థులే. నాకు జైలురాత తప్పించి పుణ్యందా కట్టుకొంటిరి.

రాజా; మీ బియ్యంతోనే పోతుందా నాకీ మచ్చ. బ్రతికినంతకాలం నాకుమాత్రం వుండదూ?

అయ్య. సరిదా. యిప్పుడుదా మనం ఏంచెయ్యవలెనూ?

రాజా: లోపలికి రండి. మీకా ప్లాను చెప్తాను.

[యిద్దరూ లోనికి వెళ్లుతుండగా తెరపడుతుంది.]

# పేదరెతు

---

## 5 వ రంగం

[శ్రీనివాసరావు యిల్లు. హాలులో రెండు కుర్చీలు, ఒక డ్రాయరు, గోడలకు కొన్ని దేవతల ఫోటోలు, వ్యంగ్యచిత్రపటాలు వుంటాయి. శారద ఫోటోలు వగైరా తుడిచి సర్దుతూ పాట పాడుతూ వుంటుంది.]

శారద : మేలుకో మేలుకో
ఓ బానిస భారత
మహిళా! మేలుకో ॥మేలుకో॥
యుగ యుగాలుగా
దాస్యాన కృశించి
సాంఘికాచారాలకు
బలియై సుఖము
మరచితివా యీవేళ?
స్వతంత్రమే వలదా? ॥మేలుకో॥
మానపతివి మర్యాదలు
వలదా? సాగిరమ్మా
స్వాతంత్ర్యము కొరకై
ముందు కడుగిడగా
ఓ యువతీ!...........
సాగి రావలదా? ॥మే॥

[పాట అయిపోయే సమయంలో శ్రీనివాసరావు వెనకవైపుగా వచ్చి సిగరెట్టు త్రాగుతూ పాట వింటూంటాడు. పాట అయిపోగానే నవ్వుతూ చప్పట్లు కొడతాడు.]

శ్రీని : హియర్, హియర్. మైడియర్ శారదా! యెంత హాయిగా పాడావ్! బ్యూటిఫుల్ సాంగ్! ఆ సరస్వతిని చంపి పుట్టావేమో ననుకున్నాను.

శార : మా అన్నయ్య రాసింది. ఏమీ పాలుపోక పాడుకుం టున్నాను.

శ్రీని : మీ అన్నయ్యా!

శార : ఊఁ, మా అన్నయ్యే.

శ్రీని : అయితే మీ అన్నయ్య అభినవతిక్కనా? ఆంధ్ర కవి బ్రహ్మ? ఆడజాతిని ఉద్ధరించడానికి అవతరించిన మహా నాయకుడు కాదుగదా?

శార : ఏం యగతాళి చేస్తారులెండి. యేదో పిచ్చిపాట రాశాడు. పిచ్చిదాన్ని కాబట్టి పాడుకుంటున్నాను.

శ్రీని : నో నో. ఎక్సలెంట్ సాంగ్! యెవడంటాడు దీన్ని పిచ్చి పాటని? ఊఁ...మళ్లీ పాడు.

శార : లోనికెళ్లి పనిచూసుకోవాలండీ.

శ్రీని : నాన్సెన్స్!. యెప్పుడూ యేం పని? ఆ ఘాశపంపుడు సినిమాతారలున్నారే వాళ్లు నీముందు బలాదూర్ తియ్యాల్సిందే.

శార : అబ్బా యేం పొగుడుతారు లెద్దురూ!

శ్రీని : నో నో. యిది పొగడటం కాదు. యీమధ్య హిజ్ మాష్టర్సు వాయిస్ రికార్డుల్లోకూడా ఇండియాలో ఆడ

వాళ్ళకు ఫ్రీడం—అంటే స్వాతంత్ర్యమన్నమాట - కావా లని తెగగోలపెడుతున్నాయి. ఆలిండియాదగ్గరనుండి ఆంధ్ర మంత్రులవరకు ఆడవాళ్ళకు స్వాతంత్ర్యం, స్వాతంత్ర్య మని తెగ ఊదరపెడుతున్నారు. యిహానేం! ఆ స్వాతం త్ర్యాగ్ని మనయింట్లోగూడా మండుతున్నదన్నమాట. యిహ తిరుగుబాటు వొక్కటే తరువాయికదూ?—

శార : ఆ తిరుగుబాటులూ, జరుగుబాటులూ మగవాళ్ళకు మీకు కావాలిగాని, మాకెందుకులెండి.

శ్రీని : అయితే మంచిదే. ఆ, మరచిపోయాను. మీనాన్ననడిగి డబ్బు తెస్తానన్నావుగదూ?

శార : తేలేదండి.

శ్రీని : ఎందుకని?

శార : డబ్బు అందలేదు. యీసారి వెళ్లినప్పుడు తెస్తాలెండి.

శ్రీని : యింతకూ తీసుకురాలేదన్నమాట?

శార : యింకా పొలం అమ్మలేదు. అమ్మినాక...

శ్రీని : షటప్. వాళ్లు యివ్వకపోతే పుట్టింటిదగ్గర యిన్నాళ్లూ ఏం చేస్తున్నావ్? యిచ్చిందాకా వుండే తీసుకురాక పోయావ్? యింతలోకే యిక్కడ కొంప యేం మునిగి పోయిందని వచ్చావ్!

శార : చేతిలో డబ్బు వుంటేనా? పసుపుకుంకుమడబ్బు అట్టిపెట్టు కుంటారా యేమిటండీ.

శ్రీని : అట్టిపెట్టుకోకపోతే పెళ్లయి ఆరేడు నెలలు గడుస్తున్నా కట్నండబ్బు యింతవరకు యెందుకివ్వాలా? వాళ్లేం మనుషులు కాదూ?

శార : మీకు ఇవ్వాలిసొచ్చాడుగాబట్టి ఎన్ని మాటలైనా అంటారు.

శ్రీని : అంత యివ్వలేని ముండమోపులు ఆవేళ పెళ్లిపందిట్లో పదిమందియెదుట యిస్తామని అఘోరించటం దేనికి? పిల్లల్ని కసగానే సరా! యెవరిని మోసంచేద్దామని?

శార : యిందులో మోసం ఏమున్నదండీ? వాళ్లేం యివ్వమన్నారా చెప్పండి?

శ్రీని : బ్లడీ బెగ్గర్స్! యిట్లాంటి పాపర్ ఏకమని తెలిస్తే ఆగడపైనా తొక్కేవాణ్ని కాదు. యిప్పటికైనా మర్యాదగా ఆ డబ్బు పట్టుకురా.

శార : నాతో మాఅన్నయ్యకూడావచ్చాడుగా?మీరేఅడగండి.

శ్రీని. నే నడిగితే నువ్వు దేనికే ముండమోపి! వెధవ. యేం మొహం పెట్టుకొచ్చాడు. నా కక్కసపడనీ, చెప్పుతీసుకొని పళ్లు రాలగొడతాను.

శార : (ఏడుస్తూ) ఈ సారి వెళ్లినప్పుడు తీసుకొస్తాలెండీ.

శ్రీని : అట్లా పనికిరాదు. నాకు చేతిలో దమ్మిడీ లేదు. వెంటనే వెళ్ళి డబ్బు తెస్తావా యింట్లో వుండు; లేదా బయటకు నడువ్. (సిగరెట్ వెలిగిస్తాడు)

శార : ఎక్కడకు వెళ్లమంటారు?

శ్రీని : యేట్లోకి. అసలు నువ్వు అడిగితేకదూ? వాళ్ళివ్వటానికి. వెధవ! బి. ఏ. వెలగబెట్టాడు. చెల్లెలికిస్తానన్న కట్నండబ్బు ఇవ్వలేదు!

శార : ఆ దిక్కుమాలిన చదువు చదవటమేకాని, చదివినందుకు యెక్కడా వుద్యోగమే దొరక్కపోయె. మాకు

దారిచమువు! దానికోసం వున్న ఆస్తినంతా తగలేశారు.

శ్రీని : యిట్లాంటి అసామకుడికి ఉద్యోగాలుకూడానా? మరి డబ్బు యివ్వకపోతే యింతకాలం అక్కడేం చేస్తున్నావ్? డబ్బుకు డబ్బు తీసుకురాక, యిక్కడ అన్నిటికీ అవస్థలు పెట్టినందుకు నిన్నేం చేస్తే పాపం తీరుతుంది.

[పెట్టెదానికి దగ్గరకు వెళ్తాడు. యింతలో శంకరం ప్రవేశించి నిలుస్తాడు.]

శంక : (శ్రీనివాసరావు చేయిపట్టుకొని) ఏమిటి బావా! గడపలో కాలుపెట్టి గడియసేపన్నా కాలేదు; అప్పుడే యేం తప్పుచేసింది?

శ్రీని : చాల్లే, వూరుకోవోయ్. యింకా సిగ్గులేకుండా మాట్లాడుతున్నావ్. పెళ్లినాడు నా కిస్తామన్న కట్నం వెయ్యిరూపాయిలూ దిగమింగి, వట్టిచేతులతో తీసుకొచ్చావూ చెల్లెల్ని. అంత గతిలేనివాళ్ళు ముందు యిస్తామనడం దేనికి?

శంక : (ఆశ్చర్యంగా) నీకు పెండ్లినాడు కట్నంక్రింద వెయ్యిరూపాయలు నే మిస్తామనలేదే! మీరు మమ్మల్ని అడగాలేదు. ఒకవేళ...

శ్రీని : యింకేం, అట్లాచెప్పు? అబద్ధానికి ఆనవాలేముంది! (దగ్గరకంటూ వచ్చి కళ్ళల్లోకి క్రూరంగా చూచి) అంత మంది జనాభాలో వెయ్యిరూపాయల కట్నం చదివించి మీ నాన్న నాకు తాంబూల మివ్వలా? ఆడినమాట పాటించలేనివాళ్ళు ఆనాడు యిస్తామనటం దేనికి? యివ్వాళ యివ్వలేమని యేడ్వడం దేనికి? మీ అమ్మా

నాన్న తేరగా కన్నారని యిక్కడ యెవరికేసి అంటగడ దామనుకున్నారు? బుద్ధి వుండక్కర్లా?

శంక : అందుకనే 'యిచ్చినవాడు యీగ, పుచ్చుకున్నవాడు పులి' అంటారు. పెళ్ళినాడు కట్నం యివ్వలేమనే చెప్పాం. మీరూ అందుకు అంగీకరించారు. గౌరవంకోసం మాత్రం లగ్నం సమయాన వెయ్యిరూపాయలు చదివించమన్నారు. అంతే గాని, యిస్తామంటే తలైనా తాకట్టుపెట్టి తెచ్చి యిచ్చేవాళ్ళం.

శ్రీని : అయితే యిది యెన్నినాళ్ళు వచ్చినా మీతో డబ్బు సంగతి చెప్పనే లేదన్నమాట! (భార్యవైపు కళ్ళురుముతూ) ఏం పశువా? యిస్తానన్నారని చెప్పావ్ కదూ! పలుకవేం?

శంక : ఏదో చిన్నతనం కావటంచేత మమ్మల్ని అడగలేక, నీ దగ్గర తప్పుకోలేక అలా చెప్పివుంటుంది.

శ్రీని : చిన్నదా? దీన్ని నరక పోగు లెయ్యాలి.

శంక : డబ్బు యివ్వలేదని అమ్మాయిని పీడిస్తే యెక్కడ తెచ్చి యిస్తుంది చెప్పు బావా?

శ్రీని : అన్నయ్యవు నీవు యిచ్చావు కాబట్టా! అమ్మాయి యివ్వలేదనుకోడానికి.

శంక : అయినా, ఆడవాళ్ళు తెచ్చే కట్నాలమీద మగవాడు ఎంతకాలం జీవిస్తాడు బావా! కట్నాలు మన పెద్దలు గౌరవంకోసం పెట్టినవి కాని...

శ్రీని : శ్రీరంగనీతులకేం లేవోయ్. వెయ్యిరూపాయిలూ తెస్తేనే నీ చెల్లెల్ని నా యింట్లో కాపురం చేయమను.

శంక : కట్నంకోసం కాపురం చెడాల్సిందేనా?

శ్రీని : యిది కాకపోతే. మరొకతె. ప్రపంచం గొడ్డుబోయిందా?

శంక : అవును. నీవంటివాళ్ళు సంఘంలో విద్యావంతులమని చెప్పుకునేది అమాయికలైన ఆడపడుచుల గొంతులు కోయటానికేగా. యింతకూ పిల్లనిచ్చిన మాకు బుద్ధి లేకపోతే నిన్ననడం దేనికి?

శ్రీని : నోర్ముయ్!

శంక : బావా! త్వరపడుతున్నావు సుమా!

శార : (కన్నీళ్ళు తుడుచుకుంటూ) అన్నయ్యా! వారి నేమీ అనకు.

శంక : (చెల్లెలి ముఖం చూచి కరిగిపోతున్న గుండెను నిబ్బరం చేసుకొని) యిల్లు అమ్మివేసైనా సరే నీ కట్నం డబ్బు పంపిస్తాలే శాంతించు బావా?

శ్రీని : అలా పనికిరాదు. నాకు వెంటనే కావాలి.

శంక : నీవంటి చదువుకున్నవాడు చేయవలసిన పని కాదుయిది.

శ్రీని : నీ ధర్మోపన్యాసాలు కట్టిపెట్టక.

శంక : అంతేనా?

శ్రీని : అంతే. ముమ్మాటికీ అంతే. నాకు కావలసింది డబ్బు కాని, నీ చెల్లెలుకాదు.

శంక : రామ్మా! పోదాం రా! యిక్కడ వుండిమాత్రం యేం సుఖపడుతావులే. చేతులారా నీ గొంతుకోశాము.

శారం : నేను రాను అన్నయ్యా! ఆయన లేని జీవితం...

శ్రీని : అహ్హాహ్హా! (వెకిలిగా నవ్వుతూ) సాక్షాత్తు భర్తృపద పూజారిణివి! (కోపంతో) వగలాడీ! యిక్కడ యెవరి దగ్గర వుంటావే?

శంక : మాటలు దేనికి బావా?

శ్రీని : నా పిల్లన్ని నేను కొట్టుకుంటాను, తిట్టుకుంటాను, అవ సరమైతే చీల్చి యెండవేస్తా.

శంక : అందులో మగవీసుడవుకూడాను. ఆడవాళ్లంటే యంత్రాలు కాదు బావా. వాళ్లూకా స్వమనిషిజన్మయెత్తారు. నీ యిష్టమొచ్చినట్లు నెళ్లగొట్టటానికేనా పెండ్లి చేసుకోవడం?

శ్రీని : నాయిష్టం నాది. (మొరటుగా అనేస్తాడు)

శంక : నీయిష్టం! రామన్నా, పోదాం రా. ఆడవాళ్ళకట్నాలతో జీవించే అనామకుడైన విద్యావంతుడు సంఘంలో బ్రతికి వున్నంతకాలం, యీ కట్నాల దురాచారం వున్నంత కాలం ఆడవాళ్ళకు జీవితసౌభాగ్యంలేదమ్మా, రా పోదాం.

శ్రీని : ఏమిట్రా! యిప్పుడు నువ్వుకూసిన కూత? పిచ్చిపిచ్చిగా వాగావంటే పళ్లురాల్తై, కట్నంకింద యిస్తానన్న డబ్బు దిగమింగి వేదాంతం వల్లిస్తున్నావే? రోషం వుండ కర్లా !

శంక : అవును, రోషం లేకపోబట్టేగా మగవాడివైపుట్టి ఆడ వాళ్ల కట్నాలమీద బ్రతకాలని ఆశించటం!

శార : అన్నయ్యా (ఏడుస్తుంది)

శ్రీని : డబ్బు యివ్వలేక యెన్ని యేడుపులైనా యేడుస్తావు. అంత గతిలేనివాడివి చెల్లెల్ని యెవరికన్నా తోశ.....

శంక : ఛీ, పశువా! (చేయి పైకెత్తుతాడు.)

శార : అన్నయ్యా! (అడ్డు వెళ్తుంది.)

శంక : ఛీ! యీ ఇంట్లో ఒక్కక్షణం వుండను.

శ్రీని : అసలు నిన్ను రమ్మని యేడ్చిందెవరు?

శంక : సభ్యత తెలియనివాళ్ళతో మాట్లాడటం నాదే తప్పు.

శ్రీని : యేమన్రా సభ్యత తెలియనివాళ్ళు? నువ్వు పెద్దమనిషివా?

శంక : రామ్మా పోదాం.

శార : ఏముఖంతో అక్కడకు రమ్మంటావు అన్నయ్యా?

శ్రీని : శ్రీముఖంతో.

శంక : సరే, నేను వెళ్తున్నాను (వెళ్ళబోతాడు)

శ్రీని : యింకా నీవు నిలబడ్డా వెందుకే? నడూ బయటకు. ఫో, ఒక్కక్షణం నా యింట్లో వుండటానికి వీల్లేదు.

శంక : (తిరిగి వచ్చి) ఈ నరకంలో వుండి సంసారం చేసేకంటె మాతో పాటే కలో గంజో త్రాగుదువుగాని రామ్మా. (శారద యేడుస్తూ కన్నీరు తుడుచుకుంటూ శంకరంతో బయల్దేరుతుంది.)

శ్రీని : (కోపంతో కాల్చుతున్న సిగరెట్టును నేలకుకొట్టి) బయల్దేరాడు మహా సంస్కర్త! (అంటూ వెళ్తాడు.)

[తెర పడుతుంది.]

★

# పే ద రై తు

## 6 వ రంగం

[అది నాగయ్య యిల్లు. యింట్లో దూలానికి ఉరిత్రాడు వేలాడుతూంటుంది. శారద నల్లని చీరె కట్టుకుని, వెంట్రుకలు విరబోసుకొని, పొంగివచ్చే దుఃఖాన్ని ఆపుకుంటూ ఒక యెత్తయిన పీట తెచ్చి. ఆ పీటమీద యెక్కి ఉచ్చులో తల దూర్చబోతూంటుంది. తెరలో దగ్గరగా పాట వినిపిస్తుంది.]

తెరలో : ఎందుకీ సాహసము
        యువతీ! భారత యువతీ!
    తీరిపోయెనా
        జీవితాశయము
    ఉప్పులేని నీ హృదయావేగము
        సంఘనాశనమని తలచితివా? ॥ఎందు॥

    సంఘదుష్కృతము రూపుమాపకనె
        ఎవరికి వారె నాశనమైతే
    పోవున? దాస్యము
        ముందు వారికైనా
    ఎన్ని యుగాలకైనా? ॥ఎందు॥

[పాట ఆలపిస్తూ కొద్దిసేపు నిదానించి, మళ్ళీ పైటచెంగును నడుముచుట్టూ బిగదీసి కన్నీరు కారుస్తూ "ఉరి" తాడు మెడకు తగిలించుకోబోతుంది. చేతులు వణికి ఒకసారి తాడు జారిపోతుంది. రెండవసారి వణుకుతున్న చేతుల్తో తాడును తగిలించుకోబోతుండగా నాగయ్యా, వెంకయ్యా ప్రవేశించి చూచి నిర్ఘాంతపోతారు. పొంగివస్తున్న దుఃఖంతో "అమ్మాయీ" అంటాడు నాగయ్య. శారద భయదుఃఖాలతో పీటమీంచి దిగి తండ్రి చేతులపైన వాలిపోతుంది. ]

శారద : నాన్నా!......

నాగ : ఎంత సాహసానికి వడిగట్టావమ్మా! నీతండ్రి బ్రతికి వుండగానేనా నీ వీ పనిచేయడం?

వెంక : పిచ్చితల్లీ! చచ్చి ఏం సాధిస్తావమ్మా! లోకంలో కాపురాలు పోయినవాళ్ళు, భర్తలు వదిలేసిన ఆడబడుచులు యెందరు లేరు? అంతా యిలాగే చావాలనుకుంటున్నారా చెప్పు తల్లీ?

నాగ : కష్టాలు మానవుల కొస్తాయి గాని, మానుల కొస్తాయా భార్యాభర్తలకు కలహాలు రావడం, కలుసుకోవడం సహజమే గదమ్మా! ఇంత మాత్రానికే......!

శార : నాన్నా! (వెక్కి వెక్కి యేడుస్తుంది.)

నాగ : ఊరుకో తల్లీ! డబ్బుకోసమేగా అతను నిన్ను వెళ్ళగొట్టింది. యివ్వాళే యీ యిల్లయినా తెగనమ్మి నిన్ను భర్తదగ్గరకు పంపుతానమ్మా. నువ్వు ముచ్చటగా కాపురం చేస్తుంటే చూడాలనేగా తల్లీ. నీ యీ ముసలితండ్రి యింతవరకూ బ్రతికివుంది. తల్లిపోయినా నిన్ను యెంతో అల్లారుముద్దుగా పెంచుకున్నాను. నా ముఖం చూచైనా ఏ అఘాయిత్యానికీ తలపెట్టకు తల్లీ!

వెంక : ఫలానావాడికూతురు భర్త వెళ్ళగొడితే ఉరిపోసుకుని చచ్చిందంటే నాన్నకు యెంత అప్రతిష్ట! చెప్పమ్మా!

నాగ : కట్నంకోసం నీ కాపురం పాడుచేస్తానా తల్లీ? అసలు ఆవేళ మనం యిస్తామన్నామా? పదిమందిలో గౌరవ కోసం చదివించమన్నారు. యిచ్చేశాక తెస్తావా చస్తావా? అని పిల్లను వెళ్ళగొట్టారు యెవ్వరైనా మమ్మల్ని కట్నం డబ్బు అడిగాడా అల్లుడు? మర్యాదగా అడిగితే నే నివ్వన న్నానా? అమ్మాయి జీవితాన్ని పాడుచేయడ మెందుకు?

శార : నేను బ్రతికమాత్రం యేం సుఖమనుభవిస్తాలే నాన్నా!

వెంక : మనం యేం కానిపని చేశామని సిగ్గుపడి చావాలమ్మా?

శార : కట్టుకున్న భర్త వెళ్ళగొడితే అభిమానమున్న యే స్త్రీ కూడ కన్నవారింటిదగ్గర అపనిందలు మోస్తూ జీవించ లేదు నాన్నా!

నాగ : ఈ కట్నాలు నీలాంటివాళ్ళ ప్రాణాలు తీయటానికే వచ్చి నట్లున్నయ్, లోపలికెళ్ళు! యేడ్వకమ్మా. నీకోసం నీ తండ్రి యేమైనాచేస్తాడు. (శారద లోనికివెళ్తుంది) చూచా వట్రా వెంకయ్యా! ఈ కట్నాలకోసం యెట్లా కాపురాలు నాశనమైపోతున్నాయో! సంఘ సంస్కర్తలమని, దేశో ద్ధారకులమని, ప్రజాపాలకులమని చెప్పుకునేవాళ్ళు యింకా బ్రతికేఉన్నారా? యిదేగదరా వీరి దేశోద్ధరణ!

వెంక : వీళ్ళ ఉద్ధరింపేమిటో తెలుస్తూనేవుందిగా. ఎంత నర కంగావుంది ఆడవాళ్ళకు యీ దేశం.

నాగ : మనమే యీ దేశాన్ని నరకంచేస్తున్నాంరా! అన్యాయా నికి ప్రజలూ, ప్రభుత్వమూ తల వంచినపుడు ఈ దేశం

నరకంగాక స్వర్గం ఎలా అవుతుందిరా!

[ శంకరం, రాముడూ కోపంతో వస్తారు ]

శంక : పాపాలకూ, పుణ్యాలకూ వెరిచేది మనం కాని, వాళ్ళు వెరుస్తారా? వాములు తినే స్వాములకు పచ్చగడ్డి ఫలహారమా !

రాము: ఎన్ని కొంప లార్పకపోతే మేడలు కట్టాడు!

శంక : (ఉరిత్రాడు చూచి) ఇదేమిటి నాన్నా ?

రాము: ఏం జరిగింది బాబూ?

నాగ : ఏం జరుగుతుంది? యింకా కాసేపు మనం బస్తీనుండి రాకపోతే అమ్మాయి మనకు దక్కేదికాదురా.

వెంక : మేము వచ్చేసరికి ఉరిపెట్టుకోబోతోందిరా. పొరపాటున తలుపు వెయ్యటం మరిచిపోయింది. లేకపోతే అమ్మాయి మనకు దక్కేదికాదు.

రాము: పెద్దగండమే తప్పిందన్నమాట?

శంక : నీచుడు! కట్నంకోసం దాని జీవితం పాడుచేశాడు.

నాగ : అతను పాడుజేసిందేముందిరా, ఆ కట్నమే అమ్మాయి కాపురం తీసిందిరా. గౌరవానికి మనం కట్నం చదివిస్తే ఆ కట్నంకోసం అతను పెళ్ళాన్ని వెళ్ళగొట్టాడు.

శంక : వెళ్ళగొట్టక యేంచేస్తాడు? త్రాగడానికి, జూదాలకు డబ్బు కావద్దూ మరి?

రాము: మీ కులంలో యిట్టాగైతే, మా కులంలో పిల్లలకు 'ఓలి' డబ్బు యిత్తేనే పెళ్లిచేత్తారు. మీరు పిల్లోడిని కొంటారు. మేము పిల్లదాన్ని కొంటాం. డబ్బులేని

వాడికి పిల్లాలేదు, పెళ్ళీ లేదు. ఆట్టేచూస్తే యిదంతా గొడ్ల సంతలాగుందండి.

వెంక : ఏదో గొప్పయింటివాడూ, యింత తింటానికీ, కట్టుకోటానికి వుంది. దాని బ్రతుకు అది బ్రతుకుద్దనుకున్నాం. గాని, యింత అఘాయిత్యం జరుగుద్దనుకున్నామా?

శంక : ఆ గొప్పతనాలే మనల్ని యిట్లా నాశనంచేస్తున్నయ్. మనకు తగినవాడికి మనం యివ్వలేము. అందనివాటి కోసం అర్రులు చాస్తే జరిగే దింతేగా! సంస్కారంలేని విలాసపురుషులైన యీ ధనవంతులతో పొత్తెందుకు?

నాగ : ఏదో శాస్త్ర చదువుకున్నవాడూ, బుద్ధిమంతుడూ అనుకున్నాం కాని......

వెంక : చదువ్వా చట్టుబండలూ! కోటివాళ్ళ కష్టసుఖాలు ఆలోచించలేని యీ చదువు దేనికిరా?

శంక ఈ చదువు కోటివాళ్ల కష్టసుఖాలు ఆలోచించే చదువు కాదులే బాబాయి. యీ చదువుకున్న వాళ్ళంతా గొప్పవాళ్ళా? చదువును స్వార్థంకోసం ఉపయోగించే వాళ్లు సమాజానికి యెప్పటికైనా హానికరమే.

రాము: అందుకనే చదువుకున్నాయనకంటే చాకలాయన మేలంటారు.

వెంక : చదువుకున్న అల్లుళ్ళు కావాలని మనం చంకలు గుద్దుకోవటమేగాని, యీ చదివేవాళ్ళంతా పెద్ద పెద్ద కట్నాలు కాజేయటానికేనని కానలేకపోతున్నాం.

శంక : అసలు పెళ్ళిళ్ళలో కట్నాలంటూ వుండకూడదు. ఆ కట్నాలున్నంతకాలం కాపురాలు బాగుపడవు.

నాగ : ఏంబాగో బండలో! అనాదినుంచే యీ దురాచారం తగలడ్డదేగా? యివ్వాళ పొమ్మంటే పోతుందా?

శంక : పోక యేంజేస్తుంది? బాల్యవివాహాలు పోవడానికి శారదా బిల్లు కారణంకాదూ? ప్రభుత్వం తలచుకుంటే యేదైనా మారుతుంది.

నాగ : ఆనాడు ఆ యింగ్లీషునారే నయం అనిపించారు. చిన్న పిల్లలకు పెళ్ళిళ్ళు చేస్తుంటే శారదా బిల్లు తీసుకొచ్చారు. స్వరాజ్యం వచ్చినాక సంస్కరణబిల్లుఒక్కటీ రాకపోయె.

వెంక : చెయ్యాల్సినవాటికి యింతవరకు గతీ మోక్షం లేదు గాని యిక సివి చేస్తారు.

రాము: కాపురంచేసేదాని కళ కాళ్ళగోళ్ళనాడే తెలుస్తుందన్నట్లు యీాళ్ళు చేసేదేందో తెలుత్తానే వుందిగా!

శంక : యిది ధనవంతుల ప్రభుత్వం. యిది నీకూ నాకూ చెయ్యడానికి కాదోయ్ వచ్చింది. వాళ్ళేదో చేస్తారని వెర్రిభ్రమే కాని, వాళ్ళేమీ చెయ్యరు.

నాగ : కొన్నాళ్ళు చూద్దాం. అన్నీ ఒక్కనాడే జరగవుగదా!

శంక : దేశంలో ఆర్థిక సమానత్వం సంఘజీవితం బాగుపడదు నాన్నా! యీ పెళ్ళిళ్ళపద్ధతి మారిపోతేనే యీకట్నాల దురాచారంగూడా మారిపోయేది. సంఘంలో స్త్రీ పురుషులకు ఆర్థికస్వాతంత్ర్యం వచ్చిననాడు గాని, దేశం బాగుపడదు. అందాకా సంఘంలో యీ హెచ్చు తగ్గులు వుండనే వుంటయ్.

వెంక : అంతేరా! సంఘజీవితం బాగుపడితేనే ఎవరికైనా శాంతి, లేకపోతే యెవరికీ శాంతి లేదు.

నాగ : అమ్మాయ్. కాసిని మంచినీళ్ళు తెచ్చిపెట్టమ్మా! ఏమి టోరా! మనకు కష్టాలు వచ్చినప్పుడు అనేకం అనుకుం టాం. అవన్నీ జరగడం మాటలా మరి.

రాము; దొర తల్చుకుంటే కానిదేంటంట?

శంక : ఆడవాళ్ళుకూడా తమహక్కులకోసంముందుకురావాలి. పురుషులతో బాటు సంఘాన్ని సరిదిద్దటానికి స్త్రీలూ కృషిచేయాలి. వాళ్లూ స్వాతంత్రం పొందాలి.

రాము: ఏందీ! ఆడవాళ్లకుకూడా సొతంత్రమా?

(శారద ప్రవేశిస్తుంది.)

శార : చదువురాని స్త్రీలు ఏం స్వాతంత్ర్యాన్ని పొందుతారు?

నాగ : చదువు మూడో కన్నులాంటి దంటారు. చదువు పురు షుల కెంత అవసరమో స్త్రీలకూ అంతే అవసరం!

శంక : మన దేశంలో స్త్రీలను విద్యావిహీనలుగా వుంచబట్టే సంఘంలో యిట్లాంటి దురాచారాలు జరుగుతున్నాయి. చుట్టరికాలకోసమో, ఆ స్తికోసమో, మేనరికాల కోసమో యిష్టంలేక పోయినా వధూవరుల మెడల్లో పురితాళ్లు కట్టకూడదు. సంఘంలో కుల మత వర్గసం బంధాలు లేకుండా వాళ్ళకు నచ్చినవాళ్ళను వివాహం చేసుకునేహక్కు వుండాలి.

నాగ : యివన్నీ చెయ్యాలంటే అందరూ కలిసిరావద్దా?

వెంక : కలిసిరాక యేం జేస్తారు? అందరికి యీ కష్టాలు తప్పనివేగా!

రాము: అయితే పోయిన పొడుగూనా యిట్లాంటి దుర్మార్గాలు జరుగుతూండాల్సిందేనా?

శంక: స్త్రీలు తమహక్కులకోసం సంఘాలు పెట్టుకుంటున్నారు. స్త్రీలకు విడాకులహక్కు, ఆస్తిహక్కు, ఉద్యోగాల్లో సమాన స్థానాలు వుంటే వాళ్ళ నీ దురాచారాలు ఏమీచేయలేవు. అందుకు మనమంతా కృషిచేయాలి.

శార : ఆవిధంగా పనిచేసినవా రెవరన్నా వున్నారాఅన్నయ్యా?

శంక : ఎందుకు లేరమ్మా. మహాత్మాగాంధీ, రాజా రామ మోహానరాయ్, వీరేశలింగం పంతులు-యింకా యెందరో యీ దురాచారాల్ని యెదుర్కోడానికి యెంతో కృషిచేశారు. యిప్పుడు వితంతువివాహాలు జరుగుతున్నాయంటే అది వీరేశలింగంపంతులుగారి చలవే గదమ్మా! వారుబోధించిన ఆశయాల్ని మనంసాధించాలి.

వెంక : తప్పకుండా సాధించాల్సిందే!

రాము: అంతకన్నా దారిలేదు.

నాగ : గొప్పగొప్పవాళ్ళ ఆదర్శాలు మనకు మార్గదర్శకంగా వుండాలి.

శంక : ఆ...బాబాయ్! మనం భోంచేసి పంచాయితీ పెద్దల దగ్గరకు వెళ్ళి రావాలిగదూ? పద.

వెంక : నిజమేరా. ఆ మాటే మర్చిపోయాం.

రాము: గూడానికి వెళ్ళి మా కోటాయిని, సుబ్బాయిని కూడా తీసుకొత్తాను. మా యింటిది కాకతగిలి పడుకుంది. దానికికాస్త మందూ మాకూ కూడా చూంచివత్తా.

శార : లే నాన్నా! భోజనానికి.

నాగ : పదమ్మా. పద.

[అంతా వెళ్తుండగా తెరపడుతుంది.]

[అది రాజారావు మేడ. వరండా హాలులో వెనుకటి సీనే. రాజారావు పేపరు చూస్తూంటాడు. వీరాయి "ట్రే" లో విస్కీబాటిలు, గ్లాసు పెట్టు కొచ్చి టేబుల్‌మీద పెట్టి, బాటిల్‌కార్కు వూడదీసి గ్లాసులో పోసి అందిస్తాడు. రాజారావు తాగుతుంటాడు.]

రాజా : కనకాయ్ వచ్చాడా?

వీరా : వచ్చి చాలాసేపయింది. మీకోసం బయట కనిపెట్టు కొని వున్నాడు.

రాజా : రమ్మని చెప్పు.

వీరా : చిత్తం (వెళ్తాడు.)

రాజా : (పేపరు తిరగేస్తూ) బ్లాకువ్యాపారుల్ని ఉరిదీస్తారంట, ఉరి! నా సరుకు నే నమ్ముకోవడంకూడా తప్పు కాబోలు! (ముఖం చిట్లిస్తాడు.)

కన : (వస్తూ) ఏమిటండీ?

రాజా : (కోపంతో) యివో కపత్రికలూ! వీళ్లకోక కబుర్లూనా!! బ్రూట్సు! వెధవరాతలు రాస్తున్నారు. దమ్మిడీకి కొరగాని ప్రతి దౌర్భాగ్యుడినీ మనపైకి రెచ్చకొడుతున్నారు.

కన : ఏం రాశారండీ?

రాజా : ఏమైనా రాస్తారు. బుద్ధివుంటేగా! దొంగవ్యాపారుల్ని గాడిదలమీద ఊరేగిస్తారట. ఉరిశిక్ష వేస్తారట!

కన : మీ సొమ్ము మీ రమ్ముకోవడమూ తప్పే!

రాజా : తప్పనే వాళ్ళఘోరించేది. దొంగవ్యాపార నిర్మూలనకు ఉరిశిక్షలేసి యేడవకపోతే సత్యాగ్రహాలు చేసి అఘోరించరాదు గాబోలు.

కన : పిడుక్కీ బియ్యానికీ ఒకే మంత్రమా? ఏం పరిపాలనండీ.

రాజా: మందిని తినేవాళ్ళంతా మంత్రులైతే మ రెట్లా వుంటుందీ పరిపాలన. ఆ జస్టిస్‌పార్టీ హయాంలో యీ ఏకులు వడుక్కునేరకం నోరెత్తితే ఎముకలు విరగబొడిచాము. కర్మంకాలి ఆకాలం పోబట్టి యివ్వాళ ఖద్దరుటోపీ పెట్టాల్సివచ్చింది. (పత్రిక టేబుల్ మీద పడేసి) ఆ పని పూర్తి చెయ్యలేదేం?

కన . ఏదీ, నిన్న వీలుపడ లేదండీ.

రాజా: నాన్సెన్స్! వారికోసం యింతగా ఆలోచించాలా. ఏ చీకట్లోనో ఒక్క బరిశెపోటుతో పడుకోబెట్టక. యీ రోజుల్లో ఖూనీకేసులు చులాగ్గా యెగిరి పోతున్నాయ్. మనగ్రామానికి శనిగ్రహంలా దాపురించాడు.

కన : అది నిన్ననే అయిపోయేది. కాని...

రాజా: ఊఁ...ఏమిటి కాని?

కన . నిన్న ఆయనచెల్లెలు ఉరివేసుకు చానబోతే చూచి తప్పించారంట. నిన్నల్లా ఆ గందరగోళంలోనే వున్నారు.

రాజా: ఏమొచ్చింది దానికి చావడానికి?

కన : మొగుడు వెళ్ళగొడితే యీపని చేసిం దంటున్నారు అందరూ.

రాజా: ఏం! ఏమన్నా...రంకు...

కన : రామరామ! పగవాళ్ళనైనా ఆమాటలు అనకూడదండి. ఆ బుల్లెమ్మగోరు నిప్పులాంటిదండి.

రాజా: (సిగరెట్టు ముట్టించి) మరి దాని మొగుడు ఎందుకెళ్ళగొట్టాడు?

కన : ఏదో కట్నమంట. ఆ పేచీపెట్టి నెళ్ళగొట్టాడండి. ఏం చక్కని చుక్కండి!

రాజా: ఆఁ అంత అందంగా వుంటుందా?

కన : అంద మేంటి? రంభేనండి. అట్లాంటి పిల్ల మన మేడలో వుంటేనా? లైబ్లెందుకండీ!

రాజా: మరి...మన కేమైనా దక్కుతుందా?

కన : అమ్మో! అది నాచేతకాదు బాబూ!

రాజా: పైసా చేతిలో పడితే చేతకాక ఏంజేస్తుందిరా? నువ్వో పనిసాధిస్తే ఒక జీవానికి సరిపోను బహుమానం తెలిసిందా?

కన : యీ బహుమానాల కేంగానండి, నాకు బడితపూజ కాకుండా వుంటే అంతే చాలు. మొన్న ఆ చెరువు కోసం చూచారుగా. ఊరూ, గూడెం అంతా ఏక మైంది. మనం ఎంత కాపలా కాత్తేనేం. యేం చేత్తేనేం ఆళ్లకు తెలిస్తే నా పీక తప్పిస్తారు.

రాజా: అఘోరించారు. ఆ శంకరంగాడిపని ముందు వదిలించా వంటే ఊళ్లో యిక మెదిలే వా డుండడు.

కన : నా శాయశక్తులా ప్రయత్నిస్తానుగదండీ.

రాజా: నాకు తెలుసు నీ స్వామిభక్తి. (నవ్వి) నాకోసం నువ్వా నిప్పులో దూకమన్నా వెనకాడవులే.

కన : (నవ్వి) మీా ఉప్పు-పులుసు తిని బతికే జీవాలం. సంఘా లంట. తెగ పెడుతుండారు.

రాజా: పెడతారు. యెందుకు పెట్టరూ? సంఘంబెట్టి చెరువునీరు సాధించుకున్నాం గదా అని కులుకుతున్నారు. వీళ్ళ

గోరీలు వరసనే లేచేది కానడంలేదు. ఫాక్టరీని వేయి కళ్ళతో చూస్తూండాలిసుమా!

కన : చిత్తం, చూస్తారుగా!

పీరా : (ప్రవేసించి) పోలీసు లొచ్చారండి?

రాజా: సరే. వెళ్ళి తీసుకురా. (పీరాయి వెళ్తాడు) రేపీపాటికి ఆ శంకరంగాడి గోరీమీద గద్దలు వాలాలి. తెలిసిందా యీ దారిన వెళ్ళు.

కన : యివ్వాళే పుటం పెడతాను చూడండి (వెళ్తాడు).

రాజా: వెధవలు! గంట గంటకూ యేంపనో నాతో. ఒక్కసారి రుచిచూపిస్తే నెత్తి కెక్కుతారు. (సర్కిలు వస్తాడు.)

రాజా: హాల్లో. గుడ్డీవినింగ్! కూరోచ్చోండి.

(యిద్దరూ చెరొక కుర్చీలో కూర్చుంటారు.)

సర్కి : ఏమండీ రావుగారు! మిమ్మల్ని గురించి కొన్ని రిపోర్టులు వస్తున్నాయ్. ఆ మాలవాళ్ల కొంపలు పీకివేయించి, వాళ్లను చెరువునీళ్లు తాగనివ్వడం లేదటగా!

రాజా: మొగుణ్ణి కొట్టి మొర్రో అన్నట్లుంది వాళ్ళపని. చెర్లో నీళ్ళు తాగితే యెవరొద్దంటారండీ. చెరువుకట్టమీద చెట్లన్నీ కొట్టుకుపోతున్నారని నాలుగురోజులు మను షుల్ని కావలా పెడితే కావలావాళ్ళను కొట్టి, సం ఘాలు పెట్టి, నా చెరువుమీద, నా యింటిమీద దొమ్మీ చేస్తూ నాపైన రిపోర్టు చేశారా?

సర్కి : ఇదంతా వాళ్ళ కల్పితగాధే నంటారా?

రాజా: నా నోటిమీదగా చెప్పించడం దేనికి? మీరే స్వయంగా

నాలుగురోజులు యిక్కడవుండి గమనించండి. మీకే తెలుస్తుంది వాళ్ళ కుట్రంతాను.

సర్కి : అయితే మాకు రిపోర్టెందుకు చెయ్యాలా?

రాజా : ఏంచేయమంటారు! గ్రామంలో కుంటా సెంటూ లేని కుంకలంతా సంఘాలుపెట్టి చేలవద్ద, చెరువుదగ్గర ప్రతి విషయంలోను తిరుగుబాటు లేవదీస్తున్నారు. అదీ యివ్వాళ్లో రేపో చేద్దామనుకుంటూనేవున్నాను. ఇంతలో తమరే వచ్చారు, లేకపోతే...

సర్కి : ఏంజరిగే దంటారు?

రాజా : నా ఫ్యాక్టరీపైన, చేలల్లోవున్న పైరుపైనా పడాలని చూస్తున్నారు.

సర్కి : ఆఁ!......

రాజా : చూస్తారుగా వాళ్ళ దౌర్జన్యం.

సర్కి : దీనికంతకూ కారకుడు యెవరంటారు?

రాజా : యింకా యెవరుంటాడండి, ఆ ఉత్తరపువీధిలో నాగయ్యనే రైతు వున్నాడులెండి. అతనికొడుకు శంకరం.

సర్కి : ఏం చేస్తుంటా డతను?

రాజా : పనిలేనిమంగలి పిల్లితల గొరిగినట్లుగా పదిమందినీ నా పైకి వురిగొల్పడం — అందినమటుకు దోచుకెళ్లడం.

సర్కి : నాన్సెన్స్! ప్రతి గ్రామంలోను యిట్లాంటి స్కౌండ్రల్సే ప్రభుత్వాన్ని, ప్రజల్ని అల్లరిపాలు చేస్తున్నారంటే నమ్మండి!

రాజా : మీరు అలుసిస్తే వాళ్లు చేయకేంచేస్తారు. ఒక్కసారి గట్టిగా బడితపూజ చేస్తే రోగంకుదిరి, వచ్చినట్లు పడి

వుంటారు. వీళ్లు యే అర్థరాత్రివేళ వచ్చి నా కొంప మీాద పడతారోనని ప్రాణాలు గుప్పెట్లో పెట్టుకుని వుంటున్నాననుకదండి.

సర్కి : సరే, రేపీపాటికి వాడిని జైలుకు పంపకపోతే చూడండి.

రాజా : థాంక్స్... శాంతి భద్రతల్ని కాపాడేందుకు మీాలాంటి వారు లేకపోతే యీా కుక్కలు మరీ యెగబడ్తా మాాపైకి.

సర్కి : ప్రభుత్వమంటే ప్రజలకు భయభక్తులు లేకపోతే యింకా పరిపాలన ఏం సాగుతుందండీ.

రాజా : దేనికీ భయపడరండి. ఆ తెల్లవాళ్లుండగా ఒక్కగాడిద నోరెత్తేవాడా, అసమర్థత మన ప్రభుత్వంలోనే వుందండి. పరిపాలించడంలో ఆ తెల్లవాళ్ళనే చెప్పాలండీ వాళ్లు దురంధరులు!

సర్కి : ప్రభుత్వం బలహీనపడటానికి కారణం నాయకుల చేత కానితనం కాదండి. ఆమాటకొస్తే యింగ్లీషువాళ్లకు చేత కాని ఆర్డినెన్సులు మనవాళ్ళెన్ని జారీచేశారోచూాడండి! హేబియస్ కార్పస్ లాంటి న్యాయచట్టాన్నికూడా తుంగలో తొక్కారా? అనుమానించితే అరెస్టులు విచారణలేకుండానే డిటెన్షన్...యింకా యేం చేయమంటారు చెప్పండి.

రాజా: అది నిజమేలెండి. కానీ......

సర్కి : మీారు తప్పుగా అర్థంచేసుకుంటున్నారు. నేనీ మూాడు సంవత్సరాల పరిపాలనలో గ్రహించింది చెప్తా. వినండి. ఒకముఠావాళ్ళు ఒకళ్లను పట్టుకోమంటే రెండవముఠా

యింకొకళ్లను పట్టుకోమంటుంది. యెవర్ని పట్టుకున్నా మాకు చావుగా నేవుంది.

రాజా: ముతాల్లేకపోతే ప్రభుత్వపక్షంలో అవినీతి పెరిగి పోతుంది. అందుకు ముఠాలు అవసరం కాదంటారా?

సర్కి : ముతాల్లేకపోతే పరిపాలకుల్లో అవినీతిపెరిగితే, ముఠాల వల్ల ప్రజల్లో అవినీతి పెరిగిపోతుంది. దేశాన్ని ఒక సైనిక శిబిరంలా మార్చినా సన్యాసికూడా జైలంటే భయపడడం లేదు. గాంధీగారికి అప్రతిష్టవస్తుందని పత్రి కలవాళ్ళు ఒక టేగోల.

రాజా: గాంధీగారు పోయినాకకూడా ఆయన ఆశయా లేమిటండీ?

సర్కి : మీరావిధంగా అంటే లాభంలేదు. దేశానికి స్వాతం త్ర్యాన్ని ప్రసాదించింది గాంధిగారు! కాబట్టి, మంచి జరిగినా చెడుజరిగినా ప్రస్తుతం యీ రామరాజ్యాన్ని సాగించటం పాలకులవంతు. అనుభవించడం ప్రజల వంతు.

రాజా: అయితే యీ విధంగా మా ఆ స్తిపాస్తులను గ్రామాల్లో వున్న పకీరురకం కాజేస్తుంటే మీరు చూస్తూ వూరు కుంటా రన్నమాట?

సర్కి : మా శాయశక్తులా శాంతి భద్రతల్ని కాపాడుతాము. తరువాత ఆ భగవంతుడి దయ! (వీరాయి విస్కీ-బాటిల్సు తెస్తాడు. అవిచూచి సర్కిలు తెల్లపోతాడు.) ఏమిటి సార్! దీన్ని ప్రభుత్వం నిషేధించిందని మీకు తెలియదూ

రాజా: (గ్లాసులో పోస్తూ) తెలియకేమండీ. ముందు దీన్ని పుచ్చుకోండి. మనలాటివాళ్ళకు నిషేధ మేమిటండీ?

సర్కి : మీ రావిధంగా అంటే లాభంలేదు. ప్రజాభిప్రాయం ప్రకారం జరిగిపోవాల్సిందే!

రాజా: ఊc...... కానివ్వండి ముందు.

సర్కి : మీరు?......

రాజా: నేనూ, మీరు అంతా ఒకటే. ముందు మీరు దీన్ని పుచ్చుకోండి. దరిద్రులకు ఖర్చు తగ్గించేందుకు గాని మన కేమిటి నిషేధం!

సర్కి: (తప్పదన్నట్లుగా గ్లాసు నందుకుంటాడు) మహాత్ముని ఆశయాలలో దీన్నైనా సాధించకపోతే యెట్లాగండీ.

రాజా: పబ్లిక్‌గా నిషేధించారు. అంతకన్నా యింకా ఏం చేయాలంటారు? ఆ స్తివున్న వాడూ, అలవాటున్న వాడూ ఆర్థి నెన్నులు పెడితేమాత్రం ఆగుతాడా?

సర్కి. (యిద్దరూ తాగుతారు) (గ్లాసులో పోసుకుంటూ) మే ముంది ఆపడానికి కదండి.

రాజా: (యిద్దరు చెరొక సిగరెట్టు వెలిగించి) ఏదో మీరు శాసనమని ప్రాకులాడడమేకాని, ఆచరణలో మీరు దీనిని ఆపలేరండి.

సర్కి: అంతేననుకోండి......

రాజా: మనిషికి హుషారిచ్చే బలిష్టమైన పదార్థాల్ని నిషేధిస్తే యెట్లాగండి. వెన్న, పాలు, మాంసం, కోడిగుడ్లు, బీరు, బ్రాంది యిలాంటివన్నీ అనుభవించగలవాళ్ళకు అందు బాటులో వుంచాలి కాని, యిట్లా నిషేధిస్తే నాలాంటి వాళ్ళకు ప్రభుత్వమంటే అభిమాన మేముంటుంది చెప్పండి?

సర్కి : మీవంటి ఒకళ్లిద్దరికోసం కాదుగా. దీనివల్ల యెన్నో లక్షలమంది చెడిపోతున్నారనేకదూ. కొన్నిలక్షలు నష్ట మొచ్చినా ప్రభుత్వం దీనిని నిషేధించింది.

రాజా: అసలు గాంధీగారి ఆశయాలు గొప్పవే. కాని, వాటిని ఆచరణలో పెట్టాలంటే నాలాంటివాళ్ళు యెంత బాధ పడతారో ప్రభుత్వం గ్రహించాలి.

సర్కి : మీలాంటివాళ్ళను కష్టపెట్టలేకనేగా, డాక్టరు సర్టిఫికేట్ ఛాన్సు యిచ్చింది. మీకు యింకా యివ్వాలంటే ముంది? ఆఁ...దానికేంగాని, నేనొక శుభకార్యం తలపెట్టాను రావుజీ! అందుకు మీ సహాయం కావాలి.

రాజా: చెప్పండి, నా చేతనైన సహాయం తప్పకుండా చేస్తాను.

సర్కి : ఆఁ మరేమీ లేదండి. మా పెద్దకుర్రవాడి వివాహం తల పెట్టాను. యెలాలేదన్నా చుట్టాలూ. స్నేహితులూ వస్తారు. ఆ శుభకార్యం నాలుగురోజులూ పదిబస్తాల బియ్యమైనా ఉడుకుతయ్యా! ప్రభుత్వం పెళ్ళిళ్ళలో కూడా ఎక్కువబియ్యం వాడకూడదని నిషేధించడంవల్ల కొనడానికీ వీల్లేదు. నాకీ విషయంలో మీరేవున్నారు.

రాజా: ఈ స్వల్పవిషయానికి మీరు నన్నింతగా అడగాలా? మొన్న నా విషయంలో మీరు చేసినసాయం జన్మలో మరుస్తానా?

సర్కి: నా చేతిలోవున్న పని కాబట్టి ఎలాగో అతికష్టంమీద మాఫుచేయించాను.

రాజా:మీరుచేసేసహాయం మీరుచేస్తే మేమూచేయాలిగదండి.

సర్కి : మీకు తెలియని దేముందిలెండి.

రాజా: ఈగ్రామంలో ప్రతివాడూ ఒక లీడరేనండి. ఆ నాగయ్య కొడుకు దాపురించినప్పటినుండి యిక్కడ ముసలం పుట్టిందం టే నమ్మండి.

సర్కి: వాడివిషయంలో మీరు భయపడనవసరంలేదు. అలాంటి వాళ్ళకు బుద్ధిచెప్పటానికి మే మున్నాం గదండీ.

రాజా: థ్యాంక్స్. నా కా దిలాసా వుందిలెండి.

సర్కి: సరే, నేను వెళ్ళొస్తానండి. చాలా సేపయింది వచ్చి.

రాజా: మంచిది. మీకు కావలసినవి పంపించుతాలెండి.

సర్కి: ఇక వెళ్ళిరానా?

రాజా: వాడివిషయంలో కాస్త వెంటనే చర్యతీసుకోవాలి. మరచిపోకండి.

సర్కి: ఆవిషయం మీరు చెప్పాలా? జైహింద్!

రాజా: జైహింద్! (సర్కిల్ వెళ్ళాడు.)

రాజా: లంచగొండి వెధవలు! బుద్ధిలేదు వీళ్ళకు.

(సిగరెట్టు నేలకేసి కొట్టి లోపలికి వెళ్ళాడు;)

[తెర పడుతుంది]



# పేదరైతు

## 8 వ రంగం

[శారద ఒక్కతే యింట్లో రాట్నం వడుకుతూ వుంటుంది. ప్రక్కన ఏకులబుట్ట వుంటుంది. కొద్దిసేపటికి వడకడం ఆపివేసి విచారంగా పాట పాడుతుంది.]

శారద : ఏమగునో నా జీవితమికా
ఎందు జూచినా దుఃఖాంబుధులాయే ॥ఏ॥
మధుర స్వప్నముల మురిసిపోవు నీ
పేకమేడలా జీవిత శోభ
కాలగర్భమునా కలయునో
రోతగాధ యీ అతివల జీవిత
గాథలు సంఘమునా బాధలు లోకమునా ॥ఏ॥

[పాట అయిపోగానే ఏడుస్తూ రాట్నంమీద తలవాల్చి కన్నీరు విడుస్తుంది. రాముడు ప్రవేశం]

రాము : బుల్లెమ్మగారు!

శార : (తలెత్తి కన్నీరు తుడుచుకుంటూ) ఏం రాముడూ!

రాము : యిప్పుడెంత విచారిస్తే ఏం లాభముందమ్మా!

శార : ఏదో రాముడు! ఎంత మరచిపోదామన్నా మరపు రాదోయ్.

రాము: ఎట్టా మరిచిపోతావులేమ్మా! పెళ్లయినాక ముచ్చటగా మూణ్ణెల్లన్నా కాపురం చేయకపోతివి.

శార : అదంతా నా కర్మలే రాముడూ!

రాము: ఆ దొరలింకా రిజిష్టరుకు వెల్లి రాలేదేమమ్మా?

శార: వస్తారులే యివ్వాళతో యింటిబుణంకూడా తీరిపోయింది?

రాము: ఉన్న కొండ్రకాస్తా ఆ రావుగారు కాజేసె. యీయిల్లు కాస్తా అల్లుడుగారు అమ్మించె. యిక మిగిలింది ఏముందమ్మా. వట్టిమనుసులేగా!

శార : నిజమే, రాముడూ, మేముపుట్టి నాన్నకు ఎన్నికష్టాలు తెచ్చాం! పుట్టకపోతేనే బాగుండేది.

రాము: బీదోళ్ళకి కష్టాలి కేం తక్కువ!

శార : నుంచున్నావేం కూర్చో రాముడూ.

రాము: కూకుంటాలేమ్మా. ఆ...ఆ వెంకయ్యగారింటికి ఎప్పు డెల్తారమ్మా! ఆరు చాలా మంచివారులేమ్మా!

శార : ఎంత మంచివాళ్లైనా పరాయి ఇల్లు పరాయి ఇల్లేగా! సొంత యిల్లేం కాదుగా రాముడూ!

రాము: కాదులెమ్మా! (నాగయ్య వస్తాడు)

శార : అదుగో? వచ్చాడునాన్న. నీమాటే అనుకుంటున్నాం నాన్నా!

రాము: నూరేళ్లాయుస్సు, ఆ దొరేరీ?

నాగ : వెనక కాస్తపమండి ఆగిపోయాడు. అమ్మాయి! కాసిని మంచినీళ్ళు పట్టుకురామ్మా! (శారద వెళ్తుంది) యివ్వాళ బస్తీనుండి నడవలేకపోయాను రాముడూ.

రాము: అందులో వట్టి బురదరోడ్డు. కాలుపెట్టడానికే వీలుండదు

కొన్నికొన్ని ఊళ్ళకు రోడ్లన్నా పడ్డాయి. మన వూరికి అదీ లేదు.

నాగ : వాన కురవకపోతేనే మన వూరి డాబు. వానకురిస్తే కాలేట్లో దిగినట్లేరా.

రాము: ఊళ్లో యింకా నయం. మా గూడెంలో మరీ అన్యాయమండీ.

నాగ : పంచాయితీ డబ్బుల్తో పొలాలు కొనుక్కుంటే బజార్లు ఎట్లా బాగుపడతైరా.

రాము: ఆ పెసిరెంటుగారు నాలుగెకరాలపొలాన్ని యిరవై ఎకరాలు ఎట్టా చేశాడు? ఆ రావుగారు రావుగారే! యీ పెసిరెంటుగారు పెసిరెంటుగారే!

నాగ : ఏనాడు మాతాత కట్టించాడో యీ యిల్లు. యీనాటికి అల్లుడు కట్నంక్రింద యీ యిల్లు ఋణంకూడా తీరిపోయింది. నా చేతుల్తోనే యిల్లూపొలం అమ్ముకొని పకీరు నైపోయాను. యివ్వాళ్ల యిల్లు రిజిష్టరుచేస్తుంటే నా ప్రాణం తరుక్కుపోయిందనంటే నమ్ము రాముడూ!

రాము: యిక యీ దేశంలో మనలాంటివాళ్ళు బతక లేరండీ.

నాగ : అబ్బాయి బెంగాలు కరువునుగురించి చెపుతుంటే నమ్మలేక పోయేవాడిని యిప్పుడు అర్థమైంది. మధ్యరకం రైతులీ దేశంలో ఎట్లా పతనమైపోతున్నారో.

శార : (వచ్చి) విన్న శివాలయందగ్గర ఎవరో నాయకుడు వచ్చి స్వతంత్రదినం జరుపమని మీటింగు పెట్టాడటగా నాన్నా!

నాగ : అవునమ్మా! మీటింగులు పెట్టడానికి. ఉపన్యాసాలు యివ్వడానికేంలే. యీ సంవత్సరం పొడుగునా మనం

ఏం స్వాతంత్ర్యం అనుభవించామని స్వతంత్రదినోత్సవం చేస్తాంలే.

రాము: ఈ స్వరాజ్యం రాకముందే నయం. నూకలజావన్నా దొరికింది. ఇప్పుడు గంజినీళ్లకుకూడా గతిలేదు.

శార : అందుకే అమ్మ అంటుండేది. "చేనున్నా చేట అప్పు, యేరున్నా యెద్దడి నీళ్లు, పాడివున్నా పుల్లగంజే"నని.

రాము: అట్లాగేవుండాయిగా అమ్మా, యిప్పుడు మనకాపురాలు.

నాగ : 'అంగట్లో అన్నీవున్నా అల్లుడినోట్లో శని' అన్నట్లుంది. యీ దేశం గొప్పదని, ప్రజలు సుఖంచడానికి అన్నిసంపదలు వున్నాయని. స్వరాజ్యంవస్తే మన కీ దరిద్రం వదిలిపోతుందని ఆనాడు మహాత్ముడు చెప్పాడు. పరదాస్యం పోయినా,యీనాడు దరిద్రంమాత్రం పోలేదు. ఆ మహాత్ముడూ పోయాడు. ఆ వాగ్దానాలూ పోయినై.

రాము: పోనీయండి. ఏం చేత్తాం. ఆఁ...అబ్బాయిగారిపెళ్లి యిహ్యేడన్నా చేత్తారా?

నాగ : చెయ్యాలనే వుంది. కాని, ఆస్తి యేంచూచి పిల్లనిస్తారు చెప్పు.

శార : అందరికి ఆస్తుంటేనే పెళ్లిళ్లవుతున్నాయా యేం?

రాము: గంతకుదగ్గబొంత అన్నట్టు మనకు తగ్గావాళ్లేవత్తారు.

నాగ : అవును. పిల్లలు పెద్దవాళ్లయి అనుభవించటానికి వచ్చేసరికి తినడానికి తిండికూడా కరువొచ్చింది. మరి వాళ్లకు ముద్దూ ముచ్చటలేం జరుగుతాయిరా. గౌరవంగా వుండే కాపురం యీ స్థితికి వచ్చింది.

శార : చారెడుభూమన్నా లేకుండా అంతా చదువుకోసం తగలేశారు. అంత చదువు చదివితే ఎక్కడా గుమస్తా గిరన్నా దొరకదాయె.

రాము: కోటిద్దలైనా కొండకు చాటిరావులెండి.

నాగా : యిదంతా చూస్తే నా కేమో జీవితాశ కనుపించ డంలా. అంతా అయోమయంగా వుంది.

రాము: ఆ బుల్లెమ్మగోర్ని అత్తోరింటి కెప్పుడు పంపిత్తారు దొరా? (శారద సిగ్గుపడుతుంది.)

నాగ : రేపో మాపో మంచిరోజు చూచి తీసుకెళ్లి దిగబెట్టా స్తాను, నేనూ అందుకే చూస్తున్నాను.

[యింతలో వెంకయ్య హడావుడిగా పరుగెత్తుకొస్తాడు. అంతా గాబరాగా చూస్తారు.]

వెంక : అన్నయ్యా! అన్నయ్యా!!

నాగ : ఏమిట్రా?

శార : ఏమిటి బాబాయ్?

రాము: ఏంటండీ?

వెంక : అబ్బాయిని పోలీసులు పట్టుకున్నారు.

నాగ : దేనికి?

శార : ఏం చేశాడని?

వెంక : ఏమీలేదు. మేము రిజిష్ట్రారాఫీసునుండి బజారు కెళ్లామా! బజారులో అవీ యివీ కొనుక్కుని మనవూరు మొగదల్లో కొచ్చేసరికి పట్టుకున్నారు.

నాగ : జైలుకు తీసుకెళ్లారా?

వెంక : యింకాలేదు. వెళదాం పద.

నాగ : వాడేం చేశాడురా? తప్పు లేకుండానే అరెస్టేమిటి?

రాము: తప్పేందుకండీ! దున్న యీనిందంటే గాటని కట్టా మన్నారంట. అట్టావుంది పరిపాలన.

శార : త్వరగా వెళ్లిరా నాన్నా వాళ్లకేం పొయ్యేకాలం వచ్చిందో. న్యాయం. అన్యాయం ఆలోచించక్కర్లా యిదేం రాజ్యం! వల్లకాటి రాజ్యం.

నాగ. అమ్మాయ్, జాగ్రత్త! రాగా వెంకయ్యా!

రాము: కడుపులోకి కూడు పెట్టకపోయినా కాళ్లకు. చేతులకు సంకెళ్లన్నా యేత్తున్నారు ధర్మప్రభువులు!

వెంక : పదరా పద.

[అంతా ఆత్రుతగా వెళ్తారు,]

[తెర పడుతుంది]



# పేదరైతు

## 9 వ రంగం

(నాగయ్య లోపలనుండి ట్రంకు తీసుకొచ్చేసరికి రాముడు బయట నుంచి వస్తాడు)

నాగ : బండి తీసుకొచ్చావా రాముడూ?

రాము: వత్తావుం దిప్పుడే దొరా! అన్నీ సర్దేశారా?

నాగ : ఆ...అన్నీ సర్దేశాము. అమ్మాయి యింట్లో వుంటే నిండుగా వుండేది. ఆడపిల్లల్ని కని పెంచి పెద్దవాళ్లను చేసి ఆఖరుకు ఒక అయ్య చేతిలో పెట్టాల్సిందేగా!

రాము: అబ్బాయిగారేమో జైల్లో వుండే. ఆయనగారి పెళ్లన్నా కాకపోయె.

నాగ : దానికాపురం బాగుపడి భార్యాభర్త లిద్దరూ ముచ్చటగా కాపురంచేస్తుంటే నా కదే పదివేలు. వున్న దే యిద్దరుపిల్లలు. అమ్మాయికి పెళ్ళిచేస్తే దానికాపురానికి యిన్ని కడగండ్లు వచ్చినై. యికముందు యెట్లాజరగనుందో మరి!

రాము: ఏం జరిగినా యీ పిల్లలకోసమేగా, రాత్రనకా, పగలనకా కరిసే పామునీ, కుట్టేతేలునీ యెరక్కుండా యిన్ని అగచాట్లు బడాలి.

నాగ: మన బ్రతుకు యెట్లాగో తెల్లారిపోతుందిలే. యీపిల్లలైనా సుఖపడతారా అంటే వాళ్లబ్రతుకూ అంతగానే వుంది.

రాము: యింత చేసి తీసికెళ్ళితే ఆ అయ్యగో రేమంటారో!

నాగ : ఏమంటాడు! అతని కావలసింది డబ్బేగా. యీ యిల్లు కాస్తా తెగనమ్మి వెయ్యిరూపాయలు తీసుకెళ్లుతున్నాగా.

రాము: సదువుచున్న వాళ్ళంటే నా కదో గొప్పగా వుండేది. సదువుకున్నాళ్లు యెక్కడన్నా నౌకరీ చేసుకొని పెళ్లాం బిడ్డల్ని పోషించాల్సిందిపోయి ఆడాళ్లు తెచ్చిన కట్నాల మీదనే బతకాలని చూత్తుంటిరి.

నాగ : అసలు వాళ్ళు చదివేదే అందుకు లేరా రాముడూ.

రాము: ఏపాపం వున్నాం ఎరగని అబ్బాయిగార్ని జైల్లో పెట్టారు. యియ్యాల ఆయనగారుగూడా లేకపోయె.

నాగ : ఏం చేస్తాంరా; యిప్పట్లో మళ్ళీ మంచిరోజు లేదట. యిప్పటికే నలుగురూ నాలుగువిధాలుగా అనుకుంటున్నారు. కుండమూరొచ్చుగాని, లోకంనోరు మూయటానికి మూతేముందిరా. రెండుమూడురోజుల్లో అబ్బాయిని జామీనుమీద విడిచిపెడతామన్నారు. వాడొచ్చిందాకా వుంటే ఎట్లా మరి? (శారద కొత్తచీర కట్టుకొని విచారంగా నిలబడుతుంది. నాగయ్య (తల నిమురుతూ) పిచ్చితల్లీ! దేనికమ్మా విచారిస్తావు? ఏనాటికైనా భర్తదగ్గరకు వెళ్లవలసినదానవేగదమ్మా! (నాగయ్య కన్నీరు పెడుతాడు)

శార : నాన్నా...(ఏడుస్తూ తండ్రి రొమ్ములమీద తలవాల్చి)

నాగ : ఏడవకు తల్లీ. శుభమాఅంటూ అత్తవారింటికి వెళ్తూ కన్నీరు కార్చకూడదమ్మా.

శార : నాన్నా... అన్నయ్యగూడా లేకపోయాడు:

నాగ : లేకపోతే రేపురాడా, నిన్ను సంతోషంగా పంపాలనేగా వాడు తలదాచుకోవడానికి జానెడుకొంప లేకుండా యిల్లు తెగనమ్మింది. కాని, ఆ మాయదారి ముండా కొడుకులు అన్యాయంగా జైల్లో పెట్టారు. మూలిగే నక్కమీద తాటిపండు పడ్డట్టుగా అన్ని కష్టాలూ మనకే రావాలీ!

(బయట గంటలచప్పుడవుతుంది.)

రాము: అదుగో, బండి వచ్చిందండి.

నాగ : బయలదేరమ్మా!

శార : నాన్నా. . .(మళ్ళీ ఏడుస్తుంది)

నాగ : తప్పు తల్లీ! అట్లా ఆడపిల్ల కన్నీరు పెట్టకూడదు. నువ్వు లక్షణంగా కాపురం చేస్తుంటే నాకు అదే సంతోషం.

రాము: యెంకయ్యగారు యింకా బత్తీనుండి రాకపోయె.

శార : తీరా నేను వెళ్ళబోయేసరికి అన్నయ్యా, బాబాయి కూడా లేకపోయారు.

నాగ :యికబయలుదేరమ్మా. మళ్ళీమంచిఘడియలు దాటిపోతై.

రాము: పదిరోజులుపోయినాక యెంకయ్యగారూ, నేను వత్తా లేమ్మా! నువ్వు లేకపోతే యీయింటికి కళే లేదమ్మా! లచ్చిందేవమ్మల్లే వుండేదానివి.

నాగ : రాముడూ, ఆ పెట్టె బండిలో పెట్టరా. పదమ్మా పద (రాముడు పెట్టె తీసుకుంటాడు. శారద వెనక నడుస్తూ వుంటుంది. నాగయ్య ముందు వెళుతూవుంటాడు. అంతా కలిసి వాకిలిదగ్గర కెళ్ళేసరికి వెంకయ్య శ్రీనివాసరావును బుజానవైచుకొని రొప్పుతూ రోస్తూ వస్తాడు. శ్రీనివాస

రావు తల పగిలివుంటుంది. గడ్డం యెత్తుగా పెరిగి వుంటుంది. అంతా ఆశ్చర్యంగా చూస్తారు)

రాము: ఎవరు బాబూ యీాయిన?

శార : బాబాయ్...

వెంక : ముందు మంచం వాల్చండి. (మంచంవాలుస్తారు. శ్రీని వాస రావును మంచంమీాద పడుకోబెట్టి ఆయాసపడుతూ గుడ్డలు సరిచేసుకుంటాడు వెంకయ్య)

నాగ : (మంచదగ్గర కూలబడి) అమ్మాయ్! ఒక పాతగుడ్డా, కాసిని మంచినీళ్లు అందుకో. (శారద ఆత్రుతగా వెళ్తుంది) ఎంత మారిపోయాడురా. (నిట్టూర్పు విడుస్తాడు.)

రాము: ఎవరు కొట్టారు అంత దెబ్బ?

వెంక : నేను అబ్బాయిదగ్గరకు వెళ్ళానా బస్తీకి. మళ్ళీతిరిగివస్తు న్నాను. మనవూరిదగ్గర ఆ చింతలతోపులో గోల విని పించింది. నేను ఏమిటాఅని అక్కడికి వెళ్లాను, దెబ్బలాడు కుంటున్నారు. అంతా తాగుబోతులూ, జూదరులూ, నన్ను చూడగానే వాళ్ళంతా పారిపోయేరు. ఇతను దెబ్బలుతిని పడివుండాడు. బాగా పరకాయించిచూద్దును గదా ఇతను, మనస్సుండబట్టక బుజాన వేసుకొచ్చాను (శారద యీలోగా గుడ్డపేలిక నీళ్లూ తెస్తుంది. నాగయ్య ముఖాన నీళ్ళుచల్లి గుడ్డతో రక్తంఅంతా తుడుస్తాడు.)

రాము: 'దినగండం నూరేళ్లాయుస్సు' అన్నట్లుంది.

వెంక : ఈ ప్రయోజకుడికోసమేగా యిల్లు తెగనమ్మితీసికెళ్లి దార బోయబోతుండాడు. యీ డబ్బుమాత్రం ఎన్నాళ్లొ

స్తుంది? నాల్గురోజులు పట్టపగలు చేస్తాడు చీట్లపేకకూ, తాగుడికీ,

శ్రీని : (హీనస్వరంతో) అబ్బా!...ఊ! (మూలిగి మెల్లగా కళ్ళువిప్పి) యిప్పుడు నే నెక్కడున్నాను?

నాగ : మన యింట్లోనేలే నాయనా!

శార : (ఏడుస్తూ నుంచుని వుంటుంది.)

శ్రీని : (అదుర్దాతో శారదను చూస్తూ) శారదా శారదా! నేనిక్కడి కెలా వచ్చాను?

వెంక : ఎట్లావచ్చావా? తీసుకొస్తేవచ్చావ్. (కోపంతో అంటాడు)

శార : బాబాయ్! (యీ మాట జాలిగా కన్నీరు తుడుచు కుంటూ అంటుంది.)

నాగ : కలవాడివి. విద్యావంతుడివి నీవే యీపని చేయడం?

శ్రీని : (మెల్లగా లేస్తాడు)

వెంక : అన్నీ తెలిసినవాడే యిట్లాంటి పన్లు చేసేది. లేకపోతే నువ్వా, నేనూ చేస్తామా?

నాగ . చదువుకున్న వాడివి, బుద్ధిమంతుడవు అనేగా నా ఒక్క గాని ఒక్క కూతుర్నీ నీ కిచ్చాను. నీపైన కొండంత ఆశలు పెట్టుకుని తగిన అల్లుడవని సంతోషించాను. కాని, మనం మానవులుగా జన్మించి విజ్ఞానవంతుల మైనది యీ కానిపన్లు చేయడానికేనా? నీమూలంగా ఎన్ని ప్రాణాలు అల్లాడిపోతున్నాయో ఆలోచించావా?

శ్రీని : మామయ్యా! చచ్చిపోయిన పాముని చంపుతావా?

నాగ : చంపడంకాదు నాయనా! నువ్వు చేసినపని క్షంచిదనే చేశావా? యిప్పటికై నా గౌరవంగా జీవించు.

వెంక : ఆ......

శార : బాబాయి! (ఏదో చెప్పాలని చెప్పలేక వూరుకుంటుంది)

రాము: సదువుసందెలు లేని మాబోటోళ్లు చేయాల్సినపని మీారు చేత్తుండారేం బాబూ? యిట్టాంటి పాడుపనులు చెయ్య బట్టే వూరుకి దూరంగా చత్తుండాం.

శ్రీని : (నాగయ్య చేతులుపట్టుకొని) నన్ను క్షమించు మామయ్యా! యిక నెప్పుడూ ఆ పాడుపని చేయను.

వెంక : యిదిగో, కొంప తెగనమ్మి నీకు వెయ్యిరూపాయలు కట్నంతీసుకొస్తుండాడు. ఆడపిల్లల్ని కని మీా కిచ్చి అమ్మాయి కాపురం కోసం అస్తమానం దిగులుపడి చావల్సిందేగా?

శ్రీని : నాకు ఆకట్నం అక్కర్లేదు మామయ్యా. నా ఆస్తి నాకుందిగాబట్టా! మీా దగ్గర తీసుకెళ్ళి పెద్దవాడిని కావ డానికి. శంకరం కనుపించడేం?

నాగ : అబ్బాయి—(చెప్పలేకపోతాడు)

వెంక : జైల్లో వేశారు.

శ్రీని : దేనికి? ఏంచేశాడు?

రాము: అన్నీ చేసేవాళ్లను జైలుకే పంపరు. ఏమీాలేనివాళ్ళకే యీా పాపం చుట్టుకునేది.

శ్రీని : తప్పులేకుండానే జైల్లోపెట్టారా?

నాగ : అవును నాయనా! యీావూళ్లో వున్నాడులే రాజారావు అనే పెద్ద భూస్వామి, దొంగవ్యాపారి. ఆ మహాను భావుడు లేనిపోనివి చెప్పి జైల్లోవేయించాడు.

వెంక : వేయించడూ? వాడి బ్లాకుమార్కెట్టును పట్టిస్తుంటే.

రాము : పట్టించాలా, పగలగొయ్యాలా. నా కొంపకీకించి, నా పెళ్లాన్ని నన్ను కొట్టి నా దగ్గర అన్యాయంగా రొండొం దలరూపాయలు కాజేశాడు.

వెంక : ఆగరా, ఒకరోజువస్తుందిలే వీళ్ళు చేసినపాపాలు బద్దలయ్యేరోజు!

నాగ : ఎన్ని కొంప లార్పాడు యీావ్రాళ్లో!

రాము, ఆర్పనీయండి, ఎప్పుడో ఒకప్పుడు చిన్నప్పుడు తాగిన దొండాకుపసరతోసహా కక్కుతాడు.

శ్రీని : ఆలాగా!......అబ్బ! అమ్మ!

నాగ : నువ్వు కదలకుండా పడుకో నాయనా! యిది బ్రతికినంత కాలం వుండేదేలే. రాముడూ! ఆపెట్టె లోపల పెట్టు!

లేరా వెంకయ్యా. ఆం అడగడం మరిచిపోయాను. అబ్బాయి ఏంచెప్పాడు?

వెంక : అబ్బాయి ఏం చెపుతాడు. యింకా రెండురోజుల్లో చార్జిషీటు పెడ్తారట!

నాగ : జామీను యిస్తారా అది?

శ్రీని : ఎందుకివ్వరు? మనం ప్రయత్నిస్తేసరి.

రాము: కాక మరి వూరుకుంటామా యేటండి.

నాగ : ఏమిటోరా. నాకు ఒకటిపోయేసరికి మరొక ఆపద చుట్టుకుంటోంది. నాకు ఏ శనో పట్టుకుంది. లేకపోతే యీా కష్టాలేమిటి?

వెంక : ఈ కష్టాలు వాటంతటవే వస్తున్నయ్యా? కలిగినోళ్లు తెచ్చిపెడుతున్నారీ అగచాట్లు. అమ్మాయ్ లోనికెళ్లి నీళ్ళుతోడు. (శారద వెళ్తుంది)

రాము: అంతేనండి.

నాగ : యిదంతా చూస్తుంటే నాకేమీ ఆశ కనిపించటం లేదురా. ముందుచూస్తే నుయ్యి, వెనుకచూస్తే గొయ్యి లాగుంది నాపని.

వెంక : నీపనేగాదు అందరిపనీ అట్లాగే వుందిలే.

శ్రీని : నీ కీవృద్ధాప్యంలో మేముకూడ కష్టాలు తెచ్చిపెట్టాం.

నాగ : అదికాదురా! నేను అనేకసార్లు జైలుకెళ్లాను. లాఠీ దెబ్బలు తిన్నాను. స్వరాజ్యం వస్తుందని మురిసిపోయాను. నేను ఏవో భ్రమలుపెట్టుకున్నాను. యీ స్వాతంత్రం ఎట్లాంటిదో యిప్పుడు తెలిసింది. యిట్లాంటి దిక్కుమాలిన స్వాతంత్ర్యాన్ని ఏరైతూ, ఏకూలీ కోరడు. యిది కోటానుకోట్ల ప్రజల జీవితాశను భగ్నం చేయడానికే వచ్చింది కాని, మన బాగుకోసం రాలేదు.

వెంక : మనవాళ్ళు మనవాళ్లని నెత్తిన కొరివిపెట్టి గోకిచ్చుకున్నాం.

[లోపలనుండి శారద పిలుస్తుంది]

నాగ : ఆఁ...వస్తున్నాం. లేవండిరా. రాముడూ! వుండు, యిక్కడే భోంచేద్దువుగాని. అమ్మాయ్! ముందు అబ్బాయికి కాసిని పాలు యివ్వమ్మా.

(అంతా కలిసి యింట్లోకి వెళ్తుండగా)

[ తెర పడుతుంది ]

# పేద రైతు

## 10వ రంగం

[అది రాత్రిసమయం: 12 గంటలవుతుంది. నాగయ్య, శారద నిద్రపోతుంటారు. ప్రక్కనదీపం వెలుగుతూ వుంటుంది. కనకాయ మెల్లగా ప్రవేశిస్తాడు. చేతిలో కత్తివుంటుంది. మెల్లగా నాగయ్య మంచందగ్గర కొచ్చి దీపం ఆర్పేస్తాడు. కత్తితో బలంగా పొడుస్తాడు. 'అమ్మా' అన్న నాగయ్య కేకతో "నాన్నా! నాన్నా" అంటూ శారద లేస్తుంది, కనకాయ పారిపోతాడు. శారద దీపం వెలిగిస్తుంది. ఆ వెలుగులో నాగయ్య శరీరం రక్తంతోతడిసి వుంటుంది. తండ్రిని చూచి ఘోరున ఏడుస్తుంది శారద]

శార : నాన్నా నాన్నా!...

(యింతలో బయటనుండి బుల్లెమ్మగారూ! తాడు, తాడు తీసుకురా. దొంగ దొరికాడు, అనే మాటలు వినిపిస్తాయి. శారద వంకెనున్న పగ్గం తీసుకెళ్తుంది. రెంటపవైపునుండి శంకరం, శ్రీనివాసరావు, వెంకయ్య ప్రవేశించి, ఆ దృశ్యంచూచి నిర్ఘాంతపోతారు.)

శంక : (దుఃఖంతో) నాన్నా, నాన్నా!

వెంక : అన్నయ్యా...

శ్రీని : మామయ్యా!

శంక : దుర్మార్గులు ఎంత ఘోరం చేశారు!

వెంక : సమయానికి లేకుండాపోతిమి. మనంకూడా ఆయనతో పాటు సందకాడే వస్తే యీ ఘోరం జరిగేదికాదు.

శ్రీని : ఏ పశువు చేసివుంటాడీ ఘోరం?

(బయటనుండి 'చంపకురా రాముడూ! బుద్ధి గడ్డితిన్నదిరా అనే పాటలతో 'పదపద' దొంగనాయాల! ఆక్కడ ఏంచేశావో చూస్తేగాని, నీ బతుకు బయటపడదు. నాగయ్యగార్ని కూనీ చేశావంట్రా? అనే మాటలు వినిపిస్తాయి.)

శంక : హంతకుడు దొరికాడు బాబాయ్!

వెంక : అది రాముడి కంఠంలాగుందే.

శ్రీని : అవును. వాడిదే.

శంక : శారద కనుపించలేదేం బాబాయి?

వెంక : అమ్మాయినికూడా ఏం ఘోరం చేశారో!

శ్రీని : వెతుకుదాం, పదండి.

(యింతలో కసకాయి చేతులు వెనక్కి విరిచికట్టి తన్నుకుంటూ రాముడు తీసుకొస్తాడు. శారద వెనక వస్తుంది.)

రాము: పదరా, దొంగనాయాల! నీ చావుకే వచ్చింది పద.

వెంక : యింకా చావు కొచ్చేదేమిటి, నుంచోబెట్టి తిత్తితీయక.

రాము: (నాగయ్య శవాన్ని చూచి) అమ్మో! చంపేశాడే!

శ్రీని : ఎవడ్రా వీడు?

వెంక : యింకెవరు, రావుగారి బంటు.

శార : అయ్యో! మా నాన్నను చంపేశాడు (అని ఏడుస్తుంది).

వెంక : నీ కెట్టా దొరికాడు వీడు?

రాము : బస్తీనుండి నాగయ్యగారు, నేనూ వచ్చామూ. నేను యింటికొచ్చేసరికి పిల్లముండకు కాస్త వళ్లు కాకతగిలిందంటేను ఆ శాస్త్రుల్లుగారింటికి మందుకెళ్లాను. యింటిదగ్గర లేదు. ఆయన వచ్చిందాకా కూర్చుని మందు తీసుకొస్తుంటే యీడు మీ యింటిపక్కన ఏంటో ఎతుకుతుండాడు. నేను అనుమానించి పక్కనే పొంచున్నా. యీ దొంగనాయాలు ఎప్పుడెక్కాడో గోడ. యింట్లోకి దూకాడు. నేను లోనికి రావటానికి యీల్లేక తలుపుదగ్గరే కర్రపట్టుకొని నుంచున్నాను. యీడు పారిపోతుండాడు. వాటంచూచి దెబ్బకు పడుకోబెట్టాను. కాస్తలో పోయింది గాని, లేకపోతే ముందు యీడిగోరీ కట్టేవాడినేనండి.

శంక : నీచుడు. వాడి కాళ్లూ చేతులూ కట్టేయండి.

వెంక : కాళ్లూ చేతులూ కట్టడం దేనికి. గొయ్యితీసిపూడ్చిపెట్టక!

శ్రీని : వీడిని ఏంచేస్తే పాపంతీరుతుంది?

కన : నాకేం తెలియదండీ, అంతా ఆ దొరగారే చెయ్యమన్నారు. డబ్బుకు గడ్డితిన్నాను...

రాము : డబ్బుకోసం ప్రాణాలు తీత్తావంట్రా? (కొడ్తాడు)

కన : చంపకండి బాబో!

శార : నిన్ను చంపాలా, చిత్రవధ చెయ్యాలా!

శంక : వీడినిచేస్తే లాభ మేముంది? దీనికి మూలకారకుడైన ఆ రాజారావుకి బుద్ధిచెప్పాలిగాని.

రాము : అంతేనండి. యిషపుచెట్టుని కుంగటేళ్ళతో పీకెయ్యాల్సిందే. యీ వెధవబ్రతుకు ఎన్నాళ్లని బతుకుతాం! ఎలాంటి మారాజుని చంపించాడు!

వెంక : న్యాయం చచ్చినాక మనం బ్రతికి దేనికి రా!

శ్రీని : యివ్వాళ మామయ్యని చంపించాడు, రేపు మనల్ని చంపిస్తాడు.

శంక : యిట్లాంటి దొంగవ్యాపారుల్ని, నరహంతకుల్ని ప్రజల నుండి దూరం చెయ్యాలి.

రాము : మనవాళ్లను యిట్టా చంపుతుంటే యెన్నాళ్లు కాళ్ళు ముడుచుకొని కూర్చుంటామంట!

వెంక : కాళ్ళుముడుచుకొని కూర్చోబట్టే యిట్లాంటి ఘోరాలు జరుగుతున్నాయి.

శంక : పదండి. మామయ్య గోరీతో పాటు వాడి గోరీకూడా కట్టాల్సిందే.

శార : నాన్నా, నాన్నా! (శవంమీదపడి ఏడుస్తుంది)

శంక : అదేం లాభం లేదు. ప్రజలందరిని కూడగట్టి శాంతి పద్ధతినే వాళ్ల ఆట కట్టించాలిగాని, ఒక వ్యక్తిని చంపి ప్రయోజనం లేదు.

అందరూ : అయితే ప్రజాఐక్యతను సాధించి అక్రమాలను రూపుమాపి (శవంవంక చూపుతూ) అన్యాయానికి బలిఅయిన ఈయన ఆత్మకు శాంతిని చేకూరుద్దాం. ఇదే మనదీక్ష.

[ తెర పడుతుంది ]



# పే ద రె తు

## 11 వ రంగం

[రాజారావు కుర్చీలో కూర్చుని సిగరెట్టు వెలిగిస్తూ వుంటాడు. బయట నుండి కోలాహలం వినిపిస్తుంది. నాయుడు గాబరాపడి లేచి పచారుచేస్తూ]

రాజా: వీరా! ఒరే వీరా!

వీరా : (వచ్చి) బాబూ, బాబూ!

రాజా: ఏమిటిరా? ఆ కేక లేమిటి?

వీరా : ఊరూనాడూ కదిలొత్తావుంది.

రాజా: ఆ కనకాయ్ వచ్చాడా?

వీరా : లేదు.

రాజా: సరే, నువ్వు వెళ్ళు.

వీరా : చిత్తం (వెళ్తాడు)

[రాజారావు కొంతసేపు ఆలోచించి దొడ్డిదోవన పారిపోతాడు. ముందు భాగాన్నుండి శంకరం, వెంకయ్య, శ్రీనివాస్, రాముడు యింకా గ్రామస్థులూ ప్రవేశం. యిల్లంతా వెతకి తలొకవైపునుండి వస్తారు ఆత్రుతగా]

శంక : కనుపించాడా?

వెంక : యింకా ఎక్కడ కనిపిస్తాడు?

రాము: పారిపోయాడేమో!

శ్రీని : పారిపోక ఏంచేస్తాడు?

శంక : వీడు చేసిన పాపాలకు ఎప్పటికైనా ప్రాయశ్చిత్తం జరిగి తీరాల్సిందే.

వెంక : జరక్కపోతే వూరందరి గొంతులూ కోయించడూ?

రాము: నా గొంతులో వూపిరున్నంతవరకు నాగయ్యగారి యీయన జేసిన దుర్మార్గాన్ని మరిచిపోతానా?

శ్రీని : మరచిపోతే ఆయనకు ద్రోహం చేసినట్లే!

శంక : ఈ రగిలిన విప్లవాగ్ని యిక ఆరకూడదు. యీ రాజారావు ఒక్కడే పోయినంతమాత్రాన యీ సమాజం మారదు. అసలు యీ దొంగవ్యాపారం వున్నంతి కాలం మనవంటి పేద రైతుకూలకు విముక్తిలేదు. దరిద్రంలో మాడి పోవాల్సిందే. ఏ సంఘశక్తితో చెరువునీరు సాధించుకున్నామో, ఆ సంఘశక్తితోనే యీ దొంగవ్యాపారాన్ని కూడా అరికట్టాలి.

శ్రీని : అంతే.

శంక , యీ దొంగవ్యాపారాన్ని అరికట్టాలంటే సంఘశక్తి కావాలి.

రాము: అయితే అంతా సంఘాలలో చేరాల్సిందే.

వెంక : సంఘశక్తి లేనిదే యిక మనం జీవించలేము.

శంక: మళ్ళీ అంతా ఒక్కసారి ప్రతిజ్ఞ చేయండి. ఏదొంగవ్యాపారుల నిరంకుశత్వానికైతే మా నాన్న బలైపోయాడో ఆ నిరంకుశ విధానాన్ని, హెచ్చుతగ్గుల సమాజాన్ని సమూలంగా నిర్మూలించి నవసమాజాన్ని నిర్మించాలి.

వెంక : అందుకు నా ప్రాణాలనైనా యిస్తాను.

రాము : కాశిల్లో కలకాలం బతికేకంటే మనిషల్లే మూన్నాళ్ళు బతికినా చాలు.

శ్రీని : చచ్చినా బ్రతికినా విజయం మనదే.

శంక : అదిగో తూర్పు రేఖలు తెల్లవారుతున్నాయి. ఆకటి గుండెల్లోనుండి వినిపించే మూల్గులే విప్లవశక్తికి తొలి పలుకులు. యీ దోపిడివిధానాన్ని అంతమొందించడమే మన లక్ష్యం. పదండి, పోదాం పదండి.

## కోరస్, గ్రూప్‌సాంగ్

పదండిరా పదండిరా
పదండి పదండి పదండిరా
కత్తుల నెదిర్చి, నెత్తురు కార్చి
కోటి గొంతులూ విప్పండోయ్! ॥పదండిరా

ఆకలి మంటి, ప్రేవులు యెండే
ప్రపంచమంతా దాటుచునూ
సమానహక్కులు, సమానశక్తి
చూపించే ఆ సవ్యపథానా
పదండి పదండి పదండిరా!

(అందరూ పాడుతూ వెళ్తూండగా తెర జారిపోతూంటుంది)

## స మా ప్తం

